## ఎక్కడికి?

మనదేశంలో పచ్చనిపైరులకూ చెట్లూ చేమలకూ అలవాటుపడిన కన్నులు, మానవుడు తెగపెంచి కట్టిన ఆ ఇటుకల ప్రపంచాన్ని భరించలేక, ఏ పచ్చదనం కనబడినా చాలునని తహతహలాడిపోయినవి. అందుచేతను ఏ పార్కులోకైనా పోయి ఒకఘడియ కాలక్షేపంచేతామని బయలుదేరి 'హైడ్‌పార్క్' చేరుకున్నాను. లండనులోని సంఘంవలె, అక్కడి ప్రకృతికూడా వేరు. మనదేశంలోనూ పార్కులు ఉన్నవి చెట్లూ చేమలూ స్వభావసిద్ధంగా పెరుగుతూవుంటే వాటిని అనుసరించి మానవుడు వరసలు దిద్దుకుంటూ ఉన్నట్టు కనబడుతుంది అక్కడిదృశ్యం. ఇక్కడ అట్లాకాదు; ప్రకృతికూడా మనుష్యుడి ఆజ్ఞకు లోబడి పెరిగినట్టు కనబడుతూంది.

ఈ వైచిత్ర్యాన్ని అట్టేచూస్తూ, నన్ను 'ఎవడో నల్లనివాడు' అనే చూపులతో ఓరగా జాగ్రత్తగా, చూస్తూవున్న మనుష్యుల్ని కనిపెడుతూ, పరధ్యాన్నంగా తీర్చినదారులవెంట తిరుగుతూవున్న నాకు హఠాత్తుగా "హెల్లో మిస్టర్ రావ్" అన్న చనువైన కంఠధ్వని ఆశ్చర్యాన్ని కల్పించింది. వెనుకకు తిరిగిచూస్తే కాటన్ చేయిచాపి ఆహ్వానించాడు. కరగ్రహణం చేసి కుశలమడిగాను ఎంతో ఆనందంతో థేంక్స్ చెబుతూ "మీరు ఇంగ్లండ్ వొస్తున్నారని వార్తాపత్రికలవల్ల తెలుసుకున్నాను కాని ఇట్లా కలుసుకుంటామనిమాత్రం అనుకోలేదు" అన్నాడు. ఈమాటలు నాకు వింతగా తోచినవి. "ఎందుకు కలుసుకోమనుకున్నారు? ఇందులో మీదేశం వొచ్చి మిమ్మల్ని మీ భార్యాబిడ్డల్ని చూడకుండా వెళ్తానా? మిస్టర్ కాటన్, నాకు లభించిన పదవులూ బిరుదులూ మొట్టమొదట మీవల్లనేకదా! .." అని నేను ఇంకా చెప్పబోతూవుంటే నాకు అడ్డువొచ్చి "మిస్టర్ రావ్! మీరు చాలా అమాయకులు. మీకు ఈప్రపంచంలో సరియైన పరిస్థితులు తెలియవు. మీరు ఇప్పు

వ ప్రైమాంలక క్రితంనున్న ఇంకొక ఇంగ్లీషువాడు వింటే మిమ్మల్ని చూడ
జనినంబ పెర్రాపతె పూరదు ఇండియాలో ఉన్నంతసేపే కాటన్ డిస్ట్రిక్ట్
కలెక్టర్ పదవి, హోదా ఇక్కడ ఇప్పుడు నేను సామాన్య మానవులలో ఒకణ్ణి
ఏ ఇంగ్లీషువాడినైనా నేను హిందూదేశంలో ఇరవైసంవత్సరాలు ఇంగ్లండు
చెలాయించిన అధికారం చలాయించాను, చాలాసంవత్సరాలు డిస్ట్రిక్టుకలెక్టర్‌గా ఉన్నా
ను' అని చెబితే, అయితే ఏంచేయమంటావు?' అని ఈసడిస్తాడు కాని, మీ
వాళ్లెంతో మిమ్మల్ని చూసినట్టు కొండమీదపెట్టి దేవతలాగ చూడడు.

అదే కాదు, మీరు ఇండియాతరఫున కమిషన్‌లో వొచ్చారు అంటే ఇక్కడ మీకు ఎంతో విలువ ఉంటుంది ప్రతి ఇంగ్లీషువాడూ మిమ్మల్ని కొంతగౌరవంతో చూస్తాడు. మేము మీ ముందు ఖాతర్‌కాము అందుచేతను ఇండియాలోని కాటన్ అనుకోవడంకి నన్ను, మీరు నా కోర్టులో కేసులు వాదించే ఏడ్వొకేటూ కాదు, ఈ పరిస్థితులలో ఈదేశంలో ఇదంతా తారుమారు. సరే, దీనికేమిగాని, ఇంగ్లండ్ ఎట్లా వుంది మీదృష్టికి?" అని ప్రశ్నించాడు.

కాటన్ చెప్పినమాటలు నాకు అర్థమైనవి కాని ఆయనకు కృతజ్ఞత చూప కుండా ఉండడం ఎట్లా? ఈయనతో స్నేహం కావడం, ఈయన నాయందు అభిమానం చూపడం ప్రారంభంగా నాప్రేక్టీస్‌లో చుక్కలు మారినవి. నన్ను మొదట ఫస్ట్‌క్లాస్ బెంచ్‌కి ప్రెసిడెంట్‌ని చేయించాడు గవర్నర్‌రాక సందర్భంలో అయన సహాయంతో నేను ఏర్పాటు చేయించిన ఆహ్వానాలూ మీటింగులూ పేదలసంతర్పణలూ సంపర్భాంలో నన్ను గవర్నమెంట్ జాబితాలలోకి ఎక్కించి మొదట రాయ్ సాహేబ్ బిరుదు ఇప్పించాడు, నాటినుంచి అందుకున్న జాతకప్రభావంవల్ల ఎమ్. ఎల్ సి , దివాన్‌బహదూర్‌ని అయి, ఈనాటికి ఈ కమిషన్‌లో ఇంగ్లండుకూడా రాగలిగినాను. దశాశేషం పూర్తిఅయ్యేలోపున సర్ బిరుదుకూడా సంపాదించగలుగుతా ననుకుంటున్నాను.

తరువాత పరిస్థితులకు ఎవరు ఎంతవరకూ కారణభూతులైనప్పటికీ నాజీవితం ప్రారంభదశలో వృద్ధికి రావడానికి కాటన్ నాకు చేసిన మహోపకారం ముఖ్యకారణం. అటువంటి ఈయనకు నా కృతజ్ఞత చూపకుండా ఉండడం ఏలాగున అని,

"మిస్టర్ కాటన్! ఎవరు ఎట్లా అనుకుంటారు అనే ఆలోచన నాకు లేదు ఆ చింత నాకు అవసరం లేదు. ఈజీవి అదృష్టం ప్రారంభానికి మీరు కారకులు. వాత్సల్యంతో మీరు నన్ను పైకి తీసుకువొచ్చిన రోజులు మరవను. అందుకు కృతజ్ఞత చూపకుండా నేను ఉండగలనా? ." అంటూవుండగానే అందుకుని. "మీ హిందువులు ఉత్తపిచ్చివారు. ఎంతసేపూ అర్థంలేని అభిమానాల్ని పట్టుకుని దేవులాడుతారు నిజం చెబుతున్నాను వినండి. మిమ్మల్ని పైకి తీసుకురావడంలో మేము నష్టపోయింది ఏమీలేదు నేను మనసు విప్పి చెప్పివేస్తున్నాను, ఎందు కంటే, ఇండియాలో ఉన్నంతసేపూ ఏ ఆంగ్లాభిమానం నన్ను అనేక కార్యా లకు ప్రేరేపించిందో, ఏసామ్రాజ్యాభిమానం నన్ను మాటిమాటికీ కదిపేవో ఆ అభిమానాలు ఈనాడు నాలో నశించిపోయినవి మిమ్మల్ని, ఎందుకు మీరు వృద్ధి అని భ్రమపడుతూన్న స్థితికి తీసుకువొచ్చానో మీరు ఇంకా గ్రహించలేదు అదంతా ఒక నాటకం. మీరు ఎవరనిమిమ్మల్ని ప్రేమించి వృద్ధికి తీసుకువొచ్చాను? మీరు కాకుంటే మరొకళ్ళయినా అవిధంగా నడిపించేవాడనే మా ఔన్నత్యం నిల వడానికీ, మా వునికి మీమీదను ఆధారపడడానికీ, మీ ప్రజాబాహుళ్యాన్ని మా అదుపు ఆజ్ఞలలో జాగ్రత్తపెట్టుకోడానికీ మిమ్మల్ని ఆడిస్తున్నాము దీనిలో. మేము నష్టపోయింది ఏమున్నది? మీదేశం పొట్టకూటికి చేరాను, మీమీద అధి కారం చలాయించాను, మిమ్మల్నిదువ్వి వాడుకుని మీవల్ల గౌరవాలూ ప్రయోజనాలూ పొందాను. మీవల్లను రాదగినంత ధనాన్ని ఆర్జించుకుని మళ్లీ నాదేశం నేను చేరు కున్నాను. ఈనాడు ఈవిధంగా కలుసుకున్నాము కనుకను కాని లేకుంటే మీ రెవరో నే నెవరినో, ఈజన్మానికి మీరు ఎక్కడనో, నేను ఎక్కడనో?"

"మిస్టర్ కాటన్, మీరు చెప్పినదంతా నిజమైనప్పటికీ, నన్ను అభిమానంతో కాప పోయినప్పటికీ మీరు వృద్ధికి తీసుకురావడ మనేది నిజం కాదంటారా?"

"మిస్టర్ రావ్, నేను ఒకమాట చెబుతాను, అది మీరూ, మీజాతీ, మీదేశం మొత్తం గ్రహించవలసింది: మీకు ఎంతసేపూ వ్యక్తిగతమైన ఆలోచనలూ, అభి మానాలేకాని, ఇతరంలేవు. అందువల్లనే మీదేశం చెడిపోతూవుంది. మన యిద్దరి తారతమ్యం చూడండి. నేను హిందూదేశం వొచ్చాను. అక్కడ ఇరవైసంవత్సరా

ఉన్నాను. మీవంటివారితో ఎందరితోనో స్నేహం చేశాను కాని వీటి అన్నింటి లోనూ నేను నా వ్యక్తిపరంగా చేసింది ఏమీలేదు నా స్వంతానికి నేను ఎంతసేపూ ఆలోచించింది ఒక్కటే అది, నా జీతంసంగతీ, నా సుఖంసంగతీ, ఇంగ్లండులో వున్న నా భార్యా బిడ్డలసంగతిని, ఇవికాకను ఇతర ఆలోచనలన్నీ ఇంగ్లీషువారి అధికారాన్ని ఎక్కువ చేయడానికీ, ఇంగ్లండు పలుకుబడీ ప్రాముఖ్యతా స్థిరపర్చ డానికీ, ఇంతకన్న ఆలోచనలు నా మనస్సులో ఏవీ వుండేవికావు.

మీసంగతి చూడండి. మీరు మీదేశంపక్షాన ఈకమిషన్‌లో వొచ్చారు నేను కనపడగానే ఏ పాతబంధువుణ్ణో ఏ ప్రాణస్నేహితుణ్ణో చూసినట్టు చూస్తున్నారు నేను మీకు చేసిన ఉపకారాలు మిమ్మల్ని ప్రేమించి మీమీద అభిమానంతో వ్యక్తిపరంగా చేశా ననుకుంటున్నారు ఇదే మీకూ మాకూ ఉన్న భేదం మా దృష్టిలో ఎంత సేపూ మా జాత్యభివృద్ధీ, దేశాభిమానమూ తప్ప ఇతర ఊహలు లేవు మీకు ఆ దృష్టే లేదు. మీరు ఈ ఇంగ్లండులో వున్నంతసేపైనా భారతజాతిని గురించీ, భారతదేశాన్ని గురించీ తప్ప ఇతరం ఆలోచించకుండా వుండడం నేర్చుకోవాలి"

"మిస్టర్ కాటన్, మీరు పొరబాటుపడుతున్నారు. సిసలైన మానవత్వాన్ని వశింపజేసే జాత్యభిమానమూ దేశాభిమానమూ భారతజాతీయలక్ష్యం కాదు, అది మా రక్తంలో లేదు"

"అయితే ఆ లక్ష్యం మీకు కుదిరేవరకూ మీకు ముక్తిలేదు ఆ తత్త్వం మీ రక్తంలో లేకపోతే ఇంజెక్షన్లవల్లనైనా ఎక్కించుకోవలసివుంటుంది ఇకముందు" అన్నాడు కాటన్, ఆయనకు సహజమైన చిరునవ్వుతో నా వీపు తట్టుతూ

"ఈసంభాషణకేంగాని, మిస్టర్ కాటన్ మీభార్యా బిడ్డల్ని చూతాం రండి. ఆమెకు బహుశా నేను జ్ఞాపకం ఉండిఉండను" అని నేను అంటూ వుండగా నా చేయిపట్టుకొని నొక్కుతూ.

"వాది అంతా ఒక విషాదగాథ, ఒకరితో చెప్పడంకూడా ఇష్టంలేదు; కాని మీరు మనవిచ్చే స్వభావం గలవారు కనుక చెబుతాను రండి, అక్కడ హోటేల్

లోకి పోయి కూర్చుందా"మని నన్ను వెంటతీసుకు వెళ్ళాడు 'రెస్టారెంట్' చేర గానే ఇద్దరం ఒక మారుమూలను బల్లదగ్గర కూర్చున్నాం నేను ఉత్త టీ తప్ప ఏమీ తీసుకోనన్నాను తాను కొంచెం మత్తుపదార్ధమేదైనా పుచ్చుకుంటాను క్షమించమన్నాడు నాకు ఆశ్చర్యంగా తోచింది. కాటన్ ఎప్పుడూ మత్తుపదార్ధాల జోలికి విస్తారం పోయేవాడుకాడు ఇంతలో 'వైటర్' వొచ్చి నాముందు టీ, కాటన్ ముందు జిన్, లైంజ్యూసూ, గ్లాసూ పెట్టి, వెళ్ళిపోయాడు మధ్య మధ్యను పుచ్చుకుంటూ కాటన్ చెప్పడం ప్రారంభించాడు

"మిస్టర్ రావ్, నా బ్రతుకు చాలా అన్యాయమైపోయింది నేను ఇరవైపైన వత్సరాలు మీదేశంలో శ్రమపడి, ఎంతో మితంగా జీవించి, ధనార్జన చేసి, ఇక్కడ వున్న భార్యాబిడ్డలకు వేనకువేలు పంపించాను నాభార్యను మీరు చూశారు. అప్పుడు ఇండియావచ్చి రెండువారాలు వుండి, వేడి భరించలేక ఇంటికి వొచ్చివేసింది అమె చాలా ఉత్తమురాలు, నన్ను మనసారా ప్రేమించేది. నేను కేంబ్రిడ్జిలో చదువుకుంటూన్న రోజులలోనే మాప్రేమ ప్రారంభం. నేను ఐ సి యస్. పేస్ కాగానే ఆమెను వివాహం చేసుకున్నాను ఆ సంవత్సరంలోనే నేను ఇండియాకు వొచ్చేశాను నా ఇరవైసంవత్సరాల ఉద్యోగదశలోనూ అయిదుసార్లు వీలున్నంత సెలవులు పుచ్చుకుని ఇంగ్లండు వొచ్చాను ఆమె ఒక్కసారి ఇండియా వొచ్చింది, రెండువారాలున్న ఎక్కువ ఉండలేకపోయింది ఆమె వచ్చినప్పుడు మీరు ఒకపెద్ద టీపార్టీ ఇచ్చారు. ఆమెతో నాకు కలిగిన సంసారసుఖమంతా ఇంతే. 'రిటైర్' అయిన తరువాత ఇక్కడి సుఖంగా మిగతా జీవితమంతా గడపగలమనే ఆశతో నేను అన్ని శ్రమలను ఓర్చి 'పెన్నీ' దగ్గరనుంచి జాగ్రత్తపెట్టాను మీరు నా బిడ్డల్ని చూడలేదు ఒక కుమారుడూ, ఒక కుమార్తె మాకు కలిగారు వాళ్ళ ఆనందాన్ని నేను ఎరిగింది చాలా తక్కువ."

ఎంతో బాధతో నిట్టూర్చి మళ్ళీ కొంచెం పుచ్చుకుని ప్రారంభించాడు

"భావిజీవితం ఇకను అంతా సుఖప్రదమే అనే నమ్మకంతో, అంత తొందరగా పెన్షన్ పుచ్చుకుని నేను బయలుదేరి వొచ్చేశాను నేనుపంపిన 'కేబుల్' చూసు

[illegible] నిలుచుంది నేను దిగగానే [illegible] ఆమె ఇంతకాలం నాకోసం ఎదురు చూసి [illegible], [illegible], [illegible] ఆమె పెదవులు నా పెదవుల్ని [illegible], [illegible] నాజీవనా [illegible] దింపినట్టయింది ఆమె ఆచేతు [illegible] అందించిన నా బిడ్డల్ని ముద్దు పెట్టుకుని ఇంటికి చేరుకున్నాం

రెండు రోజులు నా జీవితం అమృతప్రాయంగా గడిచింది కాని మూడవ రోజునుంచి నా భార్యలో ఒక మార్పు కనిపించింది ఆమె నాతో అసంతృప్తి పొందినట్లు కనిపిస్తూ, [illegible] నాకు దూరమైపోతున్నట్టూ నేను గ్రహించాను కాని ఎన్నివిధాల యత్నించినా కారణం గ్రహించలేకపోయాను ఇన్నాళ్ళ నాయెడ బాటలో ఇతరు లెవరైనా నా స్థానాన్ని ఆక్రమించారా అన్న సందేహం తోచింది. కాని, అది ఆమె స్వభావం కాదని నా అంతరంగానికి తెలుసు, అంతేకాదు నేను బాగా పరిశీలించినా అటువంటిది ఏమీ కనిపించలేదు ఏదైతేనేమి నెల దాటేప్పటికి నాతో కలిసి జీవించడం దుర్భర మన్నట్టుగా ఆమె బాధపడడం మొదలుపెట్టింది చివరకు ఇంకొక పది దినాలకు నాకు అసంగతి తెలియజేసి బిడ్డల్ని తీసుకుని తన అక్క ఇంటికి వెళ్ళిపోయింది ఇంతగా ఆమె నన్ను సహించలేనందుకు కారణం నేను గ్రహించలేకపోయాను, కాని మావదినె చెప్పినదాన్ని బట్టి తెలుసుకున్నాను. నాతో జీవితం దుర్భరమని నా భార్య బాధపడడానికి తగినంత కారణం లేకపోలేదని నాకు అవగాహన అయింది

“మా ఇంగ్లీషు అధికారాన్ని గొప్పని కాపాడడానికీ, మా సామ్రాజ్యాన్ని ఎక్కువ పదిగా నిలపడానికే ఇరవైసంవత్సరాలు మీ దేశంలో జీవించిన ఆ పద్ధతి నాకు జన్మగతమైపోయినట్టు కనబడుతుంది మీదేశంలో ప్రజావారిమీదా అధికారం చేయడమూ, అందరినీ ఆజ్ఞాపించడమూ, మానవజాతి కింతకూ అయిదడుగుల పైన నిలిచి ఉన్నట్టు ప్రవర్తించడమూ నాకు స్వాభావికమైపోయింది దీనికితోడు మీ దేశస్థులంతా బొత్తిగా బానిసలుగా, మమ్మల్ని ఆశ్రయించడం వల్లనూ, మమ్మల్ని చూసి భయపడుతూ వరించడంవల్లనూ, మాకే తెలియకుండా మాస్వభా

వాలు మారిపోతూ ఉన్నవి నేను ఇతరులవల్లకూడా విన్నాను, ఇండియాలో పెద్ద ఉద్యోగాలు చేసివచ్చినవాళ్ల ప్రవర్తనలను ఇక్కడ ఇంగ్లండులోని వారంతా అసహ్యించుకుంటున్నారు వాళ్లచూపిన అధికారాన్ని అనవసరంగా మీమీదను చెలాయించడంలో మాప్రకృతి మారిపోతూవుంది చక్కని పెద్దమనిషితరహాతో మర్యాదగా జాగ్రత్తగా ప్రవర్తించడమే సరియైన మానవత్వమని ఇంగ్లీషుసంఘంలో తయ్యారైన మావంటివారుసహితం యిరవైసంవత్సరాలు మీ లొంగిపోయే స్వభావాలమీద అధికారం చెలాయించడంలో, మీ ఆశ్రయింపులకూ బానిసత్వలకూ ప్రవర్తనలకూ అలవాటుపడి గర్వపడడంలో, స్వాతంత్ర్యాభిమానమూ ఆత్మగౌరవమూ కలిగిన ఆంగ్లేయసంఘంలో సహింపరాని దుష్ప్రవర్తన కలిగినవారై పోతున్నారు మావదిన చెప్పినప్పుడు నేను గ్రహించుకున్నాను నేను ఇండియా రాకపూర్వం నా నడవడీ నా ప్రవర్తనా అందరూ మెచ్చుకునేవారు నా భార్య నన్ను ప్రేమించడానికి అదే ముఖ్యకారణం అటువంటి ఆమెకు నేను ప్రతివిషయంలోనూ అధికారంగా మాట్లాడుతూ ఉన్నట్టూ, ఊరికెకూడా ప్రతివిషయంలోనూ చీకాకుపడుతూఉన్నట్టూ, కించిత్తు అభిప్రాయభేదం ఉంటె సహించలేనట్టూ, దుర్భరంగా మోటుమనిషిగా మారిపోయినట్టూ కనిపిస్తే ఎట్లాఉంటుంది? ఈ విధంగా ప్రవర్తించే తండ్రిదాపున బిడ్డలు తయారవుతారని ఆమెకు భయం కలిగినప్పుడు ఆమె ఎంత బాధపడివుంటుందో చూడండి ఆమె నన్ను విడిచివెళ్ళి తన అక్కదగ్గిర ఏడ్చిందట 'ఎంతో మర్యాదగా ప్రవర్తించే నా ప్రియుడిలోనుంచి, ఎంతో మార్దవస్వభావం గల నా భర్తలోనుంచి, ఆ పాడు హిందూదేశం ఇరవైసంవత్సరాలలో ఆ మర్యాదనూ మార్దవాన్ని పటిశించి, జంతుతుల్యంగా ప్రవర్తించే కఠినుణ్ణిగా మార్చివేసింది' అని

ఈ సంగతి విన్నతరువాతను అడుగడుగునా నన్ను నేను ఆత్మపరీక్ష చేసుకుంటున్నాను నన్ను నేను దిద్దుకోలేని పరిస్థితుల్లో పడిపోయానా అనిపిస్తూవుంది. చిన్న చిన్న విషయాలలో చికాకుపడటం అనవసరంగా ఆగ్రహం కలగడం నాలో నేనే గ్రహిస్తున్నాను ఇటువంటి నాతో అంత మెత్తని స్వభావమూ, చక్కని ప్రవర్తనాకలిగిన వెన్నముద్దవంటి భార్య ఎట్లాకాపురం చేయగలుగుతుంది? మిస్టర్

ని నాభార్య స్టేషన్లో నా రాకకోసం ఎదురుచూస్తూ నిలుచుంది నేను దిగగానే ఆలింగనం చేసుకుని చుంబించిన ఆ దృష్టిలో ఆమె ఇంతకాలం నాకోసం ఎదురు చూసిన ఆత్రాయుతా, బాధా, ఇమిడివుంచికపోలేదు ఆమె పెదవులు నాపెదవుల్ని పిడెచున్నప్పటికి, ఇన్నాళ్ళ నా ఒడిపెట్టా నాపెదవా కిందకు దించినట్టయింది ఆమె అచేతు ఒళ్ళో అందించిన నా బిడ్డల్ని ముద్దు పెట్టుకుని ఇంటికి చేరుకున్నాం

రెండు రోజులు నా జీవితం అమృతప్రాయంగా గడిచింది కాని మూడవ నాటినుండి నా భార్యలో ఒక మార్పు కనిపించింది ఆమె నాతో అసంతృప్తి పొందుతూ ఉన్నట్టూ, నానాటికి నాకు దూరమైపోతూ ఉన్నట్టూ నేను గ్రహించాను కాని ఎన్నివిధాల యత్నించినా కారణం గ్రహించలేక పోయాను ఇన్నాళ్ళ నాయెడబాటులో ఇతరు లెవరైనా నా స్థానాన్ని ఆక్రమించారా అన్న సందేహం తోచింది. కాని, అది ఆమె స్వభావం కాదని నా అంతఃకరణకు తెలుసు, అంతేకాదు నేను బాగా పరిశీలించినా అటువంటిది ఏమీ కనిపించలేదు ఏదైతేనేమి నెల దాటేప్పటికి నాతో కలిసి జీవించడం దుర్భర మన్నట్టుగా ఆమె బాధపడడం మొదలుపెట్టింది చివరకు ఇంకొక పది దినాలకు నాకు ఆసంగతి తెలియజేసి బిడ్డల్ని తీసుకుని తన అక్కా ఇంటికి వెళ్ళిపోయింది ఇంతగా ఆమె నన్ను సహించలేనందుకు కారణం నేను గ్రహించలేకపోయాను, కాని మావదినె చెప్పినదాన్ని బట్టి తెలుసుకున్నాను. నాతో జీవితం దుర్భరమని నాభార్య బాధపడడానికి తగినంత కారణం లేకపో లేదని నాకు అవగాహన అయింది

"మా ఇంగ్లీషు అధికారాన్నీ గొప్పనీ కాపాడడానికీ, మా సామ్రాజ్యాన్ని ఎక్కువ ఠీవిగా నిలపడానికి ఇరవైసంవత్సరాలు మీ దేశంలో జీవించిన ఆ పద్ధతి నాకు పల్యగలమైపోయినట్టు కనబడుతుంది మీదేశంలో ప్రతివారిమీదా అధికారం చేయడమూ, అందరినీ ఆజ్ఞాపించడమూ, మానవజాతి కంతకూ అయిదడుగుల పైన నిలిచి ఉన్నట్టు ప్రవర్తించడమూ నాకు స్వభావికమైపోయింది దీనికితోడు మీ దేశస్థులంతా బొత్తిగా బానిసలుగా, మమ్మల్ని ఆశ్రయించడం వల్లనూ, మమ్మల్ని చూసి భయపడుతూ చరించడంవల్లనూ, మాకే తెలియకుండా మాస్వభా

వాలు మారిపోతూ ఉన్నవి నేను ఇతరులవల్లకూడా విన్నాను. ఇండియాలో పెద్ద ఉద్యోగాలు చేసివచ్చినవాళ్ల ప్రవర్తనలను ఇక్కడ ఇంగ్లండులోని వారంతా అసహ్యించు కుంటున్నారు వాళ్లమారిన అధికారాన్ని అనవసరంగా మీమీదను చెలాయించడంతో మా ప్రకృతి మారిపోతూవుంది. చక్కని పెద్దమనిషితరహాతో మర్యాదగా జాగ్రత్తగా ప్రవర్తించడమే సరియైన మానవత్వమని ఇంగ్లీషుసంఘంలో తయారైన మావంటివారుసహితం యిరవైసంవత్సరాలు మీ లొంగిపోయే స్వభావాలమీద అధికారం చలాయించడంలో, మీ ఆశ్రయింపులకూ పొగడ్తలకూ ప్రవర్తనలకూ అలవాటుపడి గర్వపడడంలో, స్వాతంత్ర్యాభిమానమూ ఆత్మ గౌరవమూ కలిగిన ఆంగ్లేయసంఘంలో భరింపరాని దుష్ప్రవర్తన కలిగినవారై పోతున్నారు. మావదిన చెప్పినప్పుడు నేను గ్రహించుకున్నాను నేను ఇండియా రాకపూర్వం నా నడవడీ నా ప్రవర్తనా అందరూ మెచ్చుకునేవారు నా భార్య నన్ను ప్రేమించడానికి అదే ముఖ్యకారణం అటువంటి ఆమెకు నేను ప్రతివిషయం లోనూ అధికారంగా మాట్లాడుతూ ఉన్నట్టూ, ఊరికేకూడా ప్రతివిషయంలోనూ చీకాకుపడుతూఉన్నట్టూ, కించిత్తు అభిప్రాయభేదం ఉంటే సహించలేనట్టూ, దుర్భరంగా మోటుమనిషిగా మారిపోయినట్టూ కనిపిస్తే ఎట్లాఉంటుంది? ఈ విధంగా ప్రవర్తించే తండ్రిచాయను బిడ్డలు తయారవుతారని ఆమెకు భయం కలిగినప్పుడు ఆమె ఎంత బాధపడివుంటుందో చూడండి ఆమె నన్ను విడిచివెళ్ళి తన అక్కదగ్గిర ఏడ్చిందట 'ఎంతో మర్యాదగా ప్రవర్తించే నా ప్రియుడిలోనుంచి, ఎంతో మార్దవస్వభావం గల నా భర్తలోనుంచి, ఆ పాడు హిందూదేశం ఇరవైసంవత్సరాలలో ఆ మర్యాదనూ మార్దవాన్ని కబళించి, జంతుతుల్యంగా ప్రవర్తించే కిరసుణ్ణిగా మార్చివేసింది' అని

ఈ సంగతి విన్నతరువాతను అడుగడుగునా నన్ను నేను ఆత్మపరీక్ష చేసుకుంటున్నాను నన్ను నేను దిద్దుకోలేని పరిస్థితుల్లో పడిపోయానా అనిపిస్తూవుంది. చిన్న చిన్న విషయాలలో చీకాకుపడడం అనవసరంగా ఆగ్రహం కలగడం నాలో నేనే గ్రహిస్తున్నాను. ఇటువంటి నాతో అంత మెత్తని స్వభావమూ, చక్కని ప్రవర్తనాకలిగిన వెన్నముద్దవంటి భార్య ఎట్లాకాపురం చేయగలుగుతుంది? మిస్టర్

రావ్! ఇక నాకు ఆదర్శ దక్కదు, అటువంటిభార్య ఇక నాకు లభించదు నేను
ఈ దుఃఖం భరించలేను" అని కళ్ళల్లో తిరుగుతూన్న నీళ్ళను ఆపుకుంటూ, బిల్
మొత్తం, పళ్లెంలో పెట్టి, నన్ను చేయిపట్టుకుని బయట 'పేవ్‌మెంట్' మీదకు
లాక్కువొచ్చేటప్పటికి ఒక టేక్సీ వొచ్చి మా కాళ్ళవద్ద నిలిచింది. 'షోఫర్' తెరిచిన
తలుపులోనుంచి నన్ను లోపలకు పెట్టి "మిస్టర్ రావ్! సెలవు. ఇట్లా కలుసుకు
న్నందుకు సంతోషం ఇంగ్లీషువాడెవ్వడూ తన సంసారబాధలను ఇతరులకు
చెప్పడు. కాని మీరొక మెత్తని హిందూహృదయం నన్నుకూడా మీకు సన్నిహి
తం చేసుకుంటే, ఆపుకోలేక చెప్పివేశాను. ఈ స్నేహితుని విషాదగాథ మరిచి
పోండి, నేను వెళ్తాన్నాను" అని వెనుతిరగకుండా తొందర తొందరగా నడిచి
పోయాడు.

అట్లా నడిచిపోతూవున్న కాటన్‌ని "పాపం!"అని చూస్తూవున్న నన్ను "ఎక్క
డికి పోనిమ్మంటారు?" అని టేక్సీవాడు ప్రశ్నించేటప్పటికి, నామనస్సుకు ఒక్కటే
ప్రశ్న తట్టింది ఎక్కడికి, అని అధికారగర్వంతో ఉద్రూతలూగి, ఇక్కడ
ఇంటనున్న భార్యాపుత్రుల కోసమూ, తనదేశంకోసమూ, ఇరవైసంవత్సరాలు
రెక్కలు కొట్టుకున్న ఈ కాటన్ ఎక్కడికి పోతున్నాడు, ఇటువంటి వ్యక్తుల్ని ఈ
విధంగా భారతదేశానికి పంపి, అధికారం వారిద్వారా చలాయించి తన్మూలాన
సామ్రాజ్యాన్ని నిలుపుకుని, తనజాతి ఔన్నత్యానికీ వ్యక్తిసుఖానికీ తోడ్పడుతున్నా
నని భ్రమిస్తూ, ఆ వ్యక్తుల జీవితాలమీదనుంచే ఇనపనడకలు నడిచిపోతూవున్న
ఈ మహాసామ్రాజ్యం ఎక్కడికి పోతూవుంది. అనే సమస్యలో పడిపోతూవున్న
నన్ను మళ్ళీ కదిపి, "ఎక్కడికి?" అని టేక్సీవాడు ప్రశ్నిస్తే, ఆలోచనలేకుండా
జేబీలోనుంచి నా విలాస మున్న కార్డుతీసి అందించి, కన్నులుమూస్తే "దేశగౌరవం
కన్నా, దేశక్షేమంకన్నా నీస్వార్థం ఎక్కువగా ఎంచుతూవున్న నీవు ఎక్కడికి
అనే పెద్దప్రశ్న జవాబుకోసం నాయెదుర నిలిచింది.

?

# ఒక దేవుడిపుట్టుక

స్త్రీలు మధ్యాహ్నం ఒక్కొక్కరూ వెంకుబాయి భాగవతపఠన వినడానికి లక్ష్మీబాయమ్మ ఇంటిలో చేరుకునేవారు. వొద్దికతో వొణికి పలికే ఆ గొంతుకెత్తి పోతన పారవశ్యాన్ని వ్యక్తపరిచినప్పుడూ, ఆ అవస్థలవర్ణనలను బొమ్మలుకట్టి చూపిస్తూవున్నప్పుడూ, వెంకుబాయివిగ్రహాన్ని ఎవ్వరూ చూడలేదేమో! కృష్ణ వర్ణనలో విష్ణురూపమూ, పరమాత్మ ప్రత్యక్షతా గోచరమయి, కదులుతూవున్న కన్నీటితెరలోనుంచి ఆ మహాదృశ్యాలలో లీనమైపోతూ వృద్ధవితంతువులు, వొళ్లు తెలియక పరవశత్వంలో ఉండిపోయేవారు; పడుచువాళ్ళు శరీరం గరిపొడిచి కన్నులు చెమ్మగిల్లి లీలాకృష్ణుని శ్యామలవిగ్రహాన్ని చూసుసుంటూ మైమరిచి పోయేవారు. అప్పుడప్పుడు తన్మయత్వంలో వెంకుబాయి లేచి నిలబడి, భాగవతాన్ని వొదిలివేసి, నాట్యమాడుతూ కథ నడిపించివేస్తుంటే, ఆమె అడుగువేసినప్పుడు రసం చిందేది, ఆమె అభినయంచేసినప్పుడు కృష్ణుని మూర్తి సాక్షాత్కరించేది!

వెంకుబాయికాలక్షేపానికి ఆకర్షణకాని స్త్రీహృదయం ఆ పేటలోలేదు. మొదటి రోజులలో "వెంకుబాయి భాగవతం వినడానికి మధ్యాహ్నం వెళ్తాను" అన్న భార్యను 'చాల్లే!' అన్నభర్తలే పదిన్నరకు ఆఫీసుకు పోయేముందు 'వెంకుబాయి పరవశత్వంలో మధ్యాహ్నం కాఫీ పంపించడం మరిచిపోయేవు సుమా!' అనే దెప్పడంలోకి దిగిపోయారు. భర్తలు ఉద్యోగాలకూ, ఎదిగినపిల్లలు విద్యాలయాలకూ వెళ్లిపోయాక స్వసుఖాన్ని అసించబోతే బ్రతుకుబాంధవ్యం శూన్యంగానూ, స్వవిషయాలు ఆలోచించుకుందామంటే మెదడు ఖాళీగానూ తోచి, ఇరుగమ్మలక్క-

లతో అక్కడలేని ఆట విషయాలు సోదిగా మాట్లాడుకుంటూ ఘడియల నడక మంచింగా అప్పలించే స్త్రీలందరూ వెంకుబాయిభాగవతం తమజీవితాలలోని ఖాళీకి కోరినభక్తిగా ఆనందించారు.

ప్రతి శనివారం స్త్రీలందరూ వెంకుబాయితో కలిసి భజనలు చేసేవారు భర్తలు ప్రొద్దుమాలినప్పటికీ జంకులేకుండా గొంతుక ధారాళంగాయెత్తని భీరువులు సహితం ఉచ్చస్వరంతో అతిన్వేచ్ఛగా పాడేవారు ఒక్కొక్కప్పుడు వెంకుబాయి మధ్యకువొచ్చి అభినయంచేస్తూ పాడేది స్త్రీలందరూ ఆ పాటను అనుసరిస్తూ తప్పెటలు వేసేవారు అప్పుడప్పుడు పారవశ్యంలో వెంకుబాయి కన్నులు మూతపడి సొమ్మసిల్లిన చేతులమీద పట్టుకుని హారతులు ఇచ్చేవారు తెలివి వొచ్చిన తరవాత ఎవ్వరితొనూ మాట్లాడేదికాదు ఆ మర్నాడు దాహమైనా పుచ్చుకోకుండా కటికి ఉపవాసం ఉండేది. ఆ రోజంతా మౌనవ్రతం

నెలా పక్షం అయ్యేటప్పటికి 'ఒక శనివారంభజన మన యింటిలో పెట్టించుకుందాం వెంకుబాయిని అడిగి'మని భర్తలు భార్యలను హెచ్చరించడం మొదలు పెట్టారు. ఇరవైనాలుగుగంటలూ భగవత్కాలక్షేపమే వెంకుబాయికి. ప్రతిరోజూ ఉదయం ఆరుగంటలు మొదలు ఎనిమిదిగంటలవరకూ తిమ్మాజీపంతులు భగవద్గీత చదివి వినిపించేవాడు వింటూ వింటూ మధ్యమధ్యను ఆవేశంవొచ్చి మాట్లాడేది. ఆ పాండిత్యం,ఆ వేదాంతం, ఎక్కడనుంచి వొచ్చినవా ఈవిడికి అని ఆశ్చర్యం కలిగేది 'తిమ్మాజీలాంటివాడు మారిపోయి ఆమెభక్తుడయిపోతున్నాడు'అని అందరూ చెప్పుకునేవారు పూర్వం పరిచయం ఉన్నవారు ఎవరైనా కనబడి పలకరిస్తే, ఏదో ప్రపంచంలోనుంచి మాట్లాడుతూవున్నట్టు మాట్లాడేది వెంకుబాయి భగవద్విషయం కాక ఇతరసంగతి ఏదీ ఆమె రానిచ్చేదికాదు.

రెండు నెలలయ్యేప్పటికి వెంకుబాయిభక్తి ఉన్మాదావస్థలోకి దిగినట్టయింది. ఉండివుండి హఠాత్తుగా వెర్రిభజన చేసేది. అప్పుడప్పుడు భజనలో తన్మయత్వం వొచ్చి మూర్ఛపొయ్యేది. 'సాన్నిధ్యాన్ని పొందుతూవున్నది ధన్యురాలు' అనుకునేవారు అందరూ ఆమెకు ఆవేశం కలిగినప్పుడు హారతి పట్టడమూ, ఆమె

తన్మయత్వంలో మూర్ఛిల్లినప్పుడు సేవ చేయడమూ, మహాపుణ్యం అనుకున్న శిష్యురాళ్ళల్లో పోటీలు కలిగేవి. ఆ సమయాలలో ఆమె సెలవిస్తే ఇద్దరు స్త్రీలకు రోగాలు నయమైనవి పిల్లల్ని తెచ్చి ఆమెపాదాలకు మొక్కించేవారు, ఆమెకు చదివింపులు చదివించేవారు.

ఆ ధనాన్ని బీదవాళ్ళకు సంతర్పణ చేయించేది ఒకనాడు ఎవ్వరో గురుపీఠం మీదను పదిరూపాయీలు పెట్టి వెళ్ళిపోతే ఇంటిఖర్చుకి తీసుకుంటానని తిమ్మాజీ అడిగాడు 'సంసారాన్ని బుద్ధిలో పెట్టుకుని నాదగ్గరకు ఎప్పుడూ రాకు' అని తీవ్రంగా మందలించింది తిమ్మాజీ ఆమెభక్తినిగురించి అనేకవిధాల వర్ణించడం మొదలుపెట్టాడు వెంకుబాయిసంగతి అటు వుంచి తిమ్మాజీమార్పుకి అందరూ ఆశ్చర్యపడ్డారు.

చందాలువేసి ఆమెకు ఒకమఠం కట్టిస్తే బాగుంటుంది అని ఎవ్వరో అన్నారు. చందాలు తాను పోగుజేస్తానని తిమ్మాజీ వూనుకున్నాడు. ఈసంగతి వెంకుబాయికి తెలిసింది. తిమ్మాజీ రాగానే నలుగురిలోనూ మహా చీవాట్లు పెట్టింది. నా యెదరకు రావొద్దు పొమ్మంది 'నాకుచేస్తారా, నాకేమి కావాలి, ఛీ పాడుఊహలు, పాడు ప్రపంచం' అని బాధపడిపోయింది ఆనాడు నాలుగయిదుసారులు ఆవేశంవొచ్చి పడిపోయింది. మూర్ఛలో భగవంతుణ్ణి ఒకేప్రార్థన స్వార్థాన్ని చంపి కైంకర్యం అందుకొమ్మని అనాటిమంచీ ఆమెలొ ఏదోమార్పు వొచ్చినట్టు కనబడేది. ఆవేశం తరుచు వొచ్చేది...

వారంరోజులయ్యేటప్పటికి వెంకుబాయికి ఈప్రపంచం, ఈజనం సంబంధం పోయినట్టయింది. భగవద్గీతను చూసినా, భాగవతాన్ని చూసినా వెర్రిగా మాట్లాడేది. ఏమి మాట్లాడుతూవున్నదో భాషకూడా తెలిసేది కాదు. ఆరేసి గంటలకు ఒకసారి స్మారకం తప్పిపోయేది. అస్థితిలో వెంకటేశ్వరుల్నీ అలమేలమ్మనీ వర్ణిస్తూవుంటే సాక్షాత్కారం పొందినట్టు విశదమయ్యేది ఆహారాపేక్ష పోయింది, అపస్మారకంగా వున్నప్పుడు నోటిలో బలవంతంగా ఏవి పడేవో అంతే. రాను రాను నీరసించిపోతూ వుంది. ఆవేశం దగ్గరదగ్గరవో కలగడమూ, మరీ పిచ్చిగా అయిపోవడమూ ప్రారంభించింది. ఇక అష్టేకాలం శరీరం ఆగదు అనిపించింది అందరకూ

ఈ విధంగా మూడురోజులు గడిచినవి. ఒకనాడు తెల్లవారగట్ల వెర్రికేకలు ప్రారంభించింది. లక్ష్మాయమ్మ ఉలికిపడి లేచి పట్టుకుంది. ఇరుగుపొరుగంతా పరుగెత్తుకొచ్చారు. ఈసారి మూర్ఛకాదు. కన్నులుతెరుచుకునేవుంది, కానిచూపు ఎక్కడికో అతుక్కుంది వెర్రి ఆవేశంలో 'వొస్తున్నారు, వొస్తున్నారు!' అని వెర్రి కేకలు వేస్తూవుంది ఓ వర్ణిస్తూవుంది వారి విగ్రహాలను. చేరిన జనం ఆశ్చర్య పడి చూస్తున్నారు కొందరిదృష్టికి ఎవో వింతవింత లీలలు భ్రమగొల్పుతూన్నవి ఆ వర్ణనకు హారతులు పట్టారు, గుగ్గిలం పొగవేశారు, శాంతివచనాలు పలికారు, కాని లాభంలేదు

ఆవేశంలో అనర్గళధారతో వెంకటేశ్వర స్తవం దండకం ప్రారంభించింది. అడ్డులేదు, అంతులేదు దిగ్భ్రమతో నిలబడిపోయారు ప్రేక్షకులు. గంట అయ్యేటప్పటికి నమస్తే నమస్తేతో పూర్తి జేస్తూ, 'వెలిశారు, వెలిశారు, దయచేశారు. దయచేశారు, అరుగో, అరుగో!' అని లేవబోయింది. భక్తులు రెండు చేతులూ పట్టుకుని లేవదీశారు, తాను నడుస్తూవున్నట్టు లేదుకాని ఏదోశక్తి లాగుతూ వున్నట్టు లాగివేస్తూవుంది మగవాళ్ళు సహాయానికి వొచ్చారు స్త్రీలు నడిపిస్తూ వున్నారు. ఆవేశంలో వర్ణిస్తూనేవున్నది, ఆవిధంగా పక్కనున్న తోటలోకి వెళ్ళారు. అక్కడ మామిడిచెట్టుదగ్గరను ఆగి పట్టరాని ఆవేశంతో 'అరుగో వేంచేశారు!' అని కళ్ళతో ప్రత్యక్షంగా చూస్తూవున్నట్టు కేకలువేస్తూ చేతులతో తవ్వబోయింది. నలుగురూ పట్టుకుని ఆపుజేస్తూ 'అమ్మా తవ్వించుతాము, తవ్వించుతాము, శాంతి, శాంతి!' అంటూ గునపాలకు పరుగెత్తించారు పోగైన జనం భజనలూ కీర్తనలూ మారుమోగిస్తున్నారు.

గునపాలు వొచ్చేటప్పటికి ఈవార్త ఊరంతా పాకిపోయింది ఎక్కడలేని ప్రజల్నీ ఊరు ఇటు వొంపుతూవుంది. తవ్వడం ప్రారంభించారు. నాలుగుగజాలు తవ్వేటప్పటికి వెంకుబాయి ఒక్షుమ్మదిని లేచి, గోతిలోకి దూకి, 'జాగ్రత్త, జాగ్రత్త, నా తల్లికి తగులుతుంది, నాస్వామికి తగులుతుంది' అని గునపాలకు చేతులు అడ్డు పెట్టింది గునపందెబ్బ చేతికి తగిలినా లక్ష్యపెట్టలేదు. ఆ వింత ఏమిటో మరి, చర్మం గీసుకుపోయినా రక్తం రాలేదు స్వామి మహత్తు అని జనం ఆశ్చర్యపడ్డారు. ఎంత

ప్రతిమాలినా గోతిలోంచి బయటకు రాలేదు. జాగ్రత్తగా పదినిమిషాలు తవ్వేటప్ప టికి రెండు విగ్రహాలు కనపడడం ప్రారంభించినవి. వెంకుబాయిపరవశత్వం వర్ణించ వీలులేదు. ప్రజ తోసుకుని ఉక్కిరిబిక్కిరి అయిపోతున్నారు. గోతిలో పడ కుండా ఆపడం కష్టంగావుంది విగ్రహాలు దర్శనమిస్తూవున్నకొద్దీ వెంకుబాయికీ ప్రజలకూకూడా ఆవేశం హెచ్చిపోతూవుంది నమస్కారాలు పెట్టేవారూ, మొక్కుకునే వారూ, చెంపలు వేసుకునేవారూ. తొక్కిళ్ళాట అయిపోయింది. స్త్రీపురుషవివక్షత పోయి గుంపులో అందరూ ఒకే ఆవేశంలో పడిపోయారు. విగ్రహాలను ఘొత్తుకున్న వెంకుబాయిని గోతిలోనుంచి పైకి లాగేప్పటికి, మూర్ఛపడిపోయింది పక్కనున్న తాటాకు గుడిసెలోకి ఆమెను చేర్చి, వెర్రిభజనలు ప్రారంభించారు. ప్రజలు కిటకిట లాడిపోతున్నారు. వెంకుబాయి దర్శనానికీ వెంకటేశ్వర్ల దర్శనానికీ. అప్పుడే కట్నాలూ కానుకలూ దిగుతూఉన్నవి తిమ్మాజీ లక్ష్మీబాయమ్మా సమస్తమూ జాగ్రత్తపెడుతున్నారు.

వెంకుబాయికి తెలివివొచ్చింది. విగ్రహాల ఎదరకు వొచ్చి కూర్చుంది. ఒకే చూపు. మాట లేదు. ఊరిలో ఊరేగింపుప్రయత్నాలు జరుగుతూ ఉన్నవి. లక్ష్మీ బాయమ్మ తోట చదివించింది చూడవొచ్చిన స్త్రీలు కొందరు పరవశత్వంలో నగలు తీసి చదివించివేశారు. ఊరిలో పెద్దలు పెద్దమొత్తాలు దేవాలయం కట్టించడానికి వాగ్దానాలు చేశారు.

ఆనాటిరాత్రికి పెద్ద విమానం కట్టి విగ్రహాలనూ వెంకుబాయినీ ఊరేగించారు. తీర్థమంత ఉత్సవం జరిగింది ఊరేగింపు తెల్లవారగట్లను ముగించి మళ్ళీ తోట చేరుకున్నారు. వెంకుబాయి ఇక తోట వొదిలి రానని, ఆ పాకయెదర విగ్రహాలను నిలిపి, పాకలో వుండిపోయింది. శిష్యురాళ్ళు ఒకరు విడిచి వొకరు సేవకు నిలుస్తూ వొచ్చారు. రోజురోజూ పొరుగూళ్ళకు ఈవార్త పాకిపోతూవుంది. పగలంతా జనం తీర్థంగా చూసి కానుకలు చదివించి పోతూవున్నారు. ఒక వైదీకి వితంతువు వెంక టేశ్వరదంపతుల నిత్యపూజాపునస్కారాలకు పదియెకరాల పాటిపొలాలు అర్పిం చింది తిమ్మాజీతోపాటు పదిమందీ శ్రమపడి పోగుజేస్తే చిన్నాపెద్దా మొత్తాలు

అంతా అయిదువేలు పోగయినై, ఒకవారానికి, దేవాలయనిర్మాణకు ఒకరు రాయి, ఒకడు సున్నం, ఒకడు ఇటుక, ఎవరిశక్తికొద్దీ వారు అర్పించుకున్నారు. మంచి రోజుచూసి శంకుస్థాపన చేశాడు

వెంకుబాయి ఎవ్వరితోనూ మాట్లాడదు మౌనవ్రతం ఇప్పుడు మూర్ఛ పోవడం అదీలేదు విగ్రహాలను అస్తమానూ చూస్తూ, వాటికి అలంకారాలూ సేవలూ చేస్తూవుంటుంది ఎక్కువసేపు విగ్రహాల పాదాలమీద చేతులు వుంచి నిద్రపోతుంది 'సిద్ధురాలయింది ఇంకేమికావాలి శ్రీసాన్నిధ్యం చేరుకుంది' అనేవారు జనమంతా మొత్తంమీద మూడు నెలలయ్యేప్పటికి తిమ్మాజీ, లక్ష్మీబాయి, ఇతర శిష్యవర్గంవల్ల స్వామికి దేవాలయమూ, వెంకుబాయికి పెంకుటికుటీరమూ వొచ్చిపోయేవారికి తోటచివరను నివాసగృహమూ నిర్మాణం అయిపోయినై శ్రీవెంకటేశ్వరస్వామికీ శ్రీ అలమేలమ్మకూ సంవత్సరానికి రెండువేలు నికరాదాయం వొచ్చే భూవసతి ఏర్పాటయింది లక్ష్మీబాయమ్మతాలూకు మిగతా తోటంతా ఎక్కువ ధనమిచ్చి కొనేశారు, ప్రజలు అనేక ఊళ్ళనుంచి వొత్తిడిగానే వొస్తున్నారు ఊరిలో హడావిడిమాత్రం కొంత తగ్గింది.

* * *

ఖాదరాలీఖాన్ గుడివెనక మామిడితోటలోకి కాపురం మార్చాడు అని తెలియడంతోనే ఊరంతా పుకార్ ప్రారంభమైంది. ఇంతలో తోటా, పదియెకరాల పొలాలూ ఖాన్‌కీ, మిగతాభూములు తిమ్మాజీకీ, వెంకుబాయి ఆమరకం రిజిస్టరు చేయించింది అని విశదమైంది. దానితో ఊరంతా అనేక అల్లరిమాటలు బయలుదేరినవి "ఎంత నాటకమాడింది అంటే, ఎంత నాటకమాడింది!" అని ఆశ్చర్యపడేవారూ, ఇదివరకు ఆమెతో గంతులువేసి సేవలు చేసినందుకు సిగ్గుపడుతూ అసహ్యించుకొనేవారూ, ఊరుకుంటేకాదు దీని పనిపట్టించాలి అని పౌరుషంగా బాధపడేవారూ; ఈవిధంగా వూరంతా కల్లోలమయింది దేవాలయంలోనుంచి వెంకుబాయిని తప్పించి స్థిరాస్తి లాగించివేతామని యత్నాలు చేయబోతే, అసలు రహస్యం బయటపడింది. తిమ్మాజీ జాగ్రత్తగా భూములన్నీ వెంకుబాయికే దానమిచ్చినట్టు ఆమెపేరనే రిజిస్టరీలు చేయించాడు అప్పుడు ఎవ్వరూ అనుమాన

మయినా పడలేదు ఈ రహస్యం బయటపడిగానే ఊరంతా గోల బయలుదేరింది ఈ అల్లరికి అమరకంతోపాటు పెళ్లిలేని ఆలీఖాన్ తోటలో కాపురంపెట్టడం దోహదమయి వెంకుబాయిపూర్వచరిత్రకు లంకె అయింది ఇంత గోలకావడానికి ఆమెపూర్వచరిత్ర ఎంతఅద్భుతమయిందా అనిపిస్తుంది ఆ చరిత్ర

* * *

లక్ష్మీజీపంతులు మాధ్వుడు, కోర్టులో గుమాస్తా గంగిగోవులాంటిసాధువు. ఆయన్ని చూస్తేనే జాలివేసేది అందరికీ ఆయినభార్య వెంకుబాయి, భర్తను శాసించేది, భర్తనేకాదు వీలున్న అందరినీకూడా ఆరోజులలో వెంకుబాయి, నడుముకింది గొప్పలూ వొంపులూ వ్యక్తమయ్యేటట్టూ, తొడల జార్పులు ప్రతీ బింబిచేటట్టూ, వేపారివద్ధతిని మాహేశ్వరీచీర కట్టి, పొరపాటున జారినట్టున్న రెండు ముంగురులు నొసటను నాట్యమాడ వొదిలి, చెంపల కురులు జారదువ్వి, మడమ శీలలమీద జీరాడే చీరఅంచులు కదలులాడుతూ వొయ్యారపు హంసనడకలు కులు కుతూ వీధివెంట నడుస్తూవుంటే «బాజారే తిరిగి చూసేది», ఆమె కబుర్లు చెబుతూ వుంటే కన్నులు నాట్యమాడేవి, ఆమె కదులుతూవుంటే కులుకు లొలికేవి. ఆ సౌం దర్యానికి బందీకాని భావజ్ఞుడు లేడు.

లక్ష్మీజీపంతులు జీవితం వీలైనంతవరకూ ఆఫీసులోనే ఆయిపోయేది. రాత్రులు ఆఫీసువిడిచిపెట్టే ఆఖరిగుమాస్తా ఆయనే. మూడవ శనివారమూ ఆది వారమూ, సెలవురోజులూకూడా ఆయన ఆఫీసుపని చూసుకుంటూనే వుండేవాడు. పనిలేకపోతే ఆఫీసు వరాండాలో చుట్టకాల్చుకుంటూ కూర్చునేవాడు. జీతం రాగానే పైసా తప్పవకాపండా అంతా వెంకుబాయి చేతిలో వేసేవాడు. జీవితం ఆయన మనస్సుకి ఏలాఉన్నదీ ఎవ్వరూ గ్రహించలేకపోయేవారు. సమస్తమూ చక్కగా సర్దుపపోయేవాడు ఇంటివ్యవహారాలన్నీ వెంకుబాయే అతి చాకచక్యంగా చూసు కునేది డాబామీది మేడ తాను స్వయంగా కట్టించింది ఆమె ఎవరితో ఏ వ్యవ హారం ఏవేళ ఏకాంతం మాట్లాడుతూవున్నా ఆయన జోక్యం కలుగజేసుకునేవాడు కాడు లక్ష్మీజీపంతులు బ్రతికివున్నన్నాళ్ళూ వెంకుబాయి జీవితం ఎంత విప రీతంగావున్నా భర్తచాటుగా చక్కగానే సాగిపోయింది.

ఆ అదృష్టవంతుడు చనిపోయాడు, ఆనాటినుంచీ వెంకుబాయికి అల్లరులు ప్రారంభం. తిమ్మాజీ రాలిపోకలా ఆతని ప్రవర్తనా కాకను, ఇతరం చెప్పనక్కర లేదు. చాటున ఎన్ని అపవాదులు రేగుతూవున్నా, పక్కలనుంచి ఎన్ని సకిలింపులు చెవిని పడుతూవున్నా వెంకుబాయి లక్ష్యపెట్టలేదు అంతేకాదు, ఖాదరాలీఖానుకు సోడామెషీను కొనిపెట్టి, సోడాషాపు పెట్టించినప్పటికీ ఊరుకున్నారు. కాని, తెగించి సాహేబును మేడమీద ఇల్లరికం పెట్టించగానే సహించలేకపోయారు, ఆనాటినుంచీ అల్లరి బహిరంగంగా ప్రారంభించారు అప్పటికీ వెంకుబాయి లక్ష్యపెట్టలేదు. సాహెబు బలవంతుడు, రౌడీ, రౌడీలందరూ అతని స్వాధీనం, అహింసాతత్వం శల్యాలలో వేళ్ళుతన్నిన హిందూసంఘం ఏంచేసి నిర్వహిస్తుంది ? అయినా వార సులచేత దావా వేయించి కోర్టుకు రప్పించి అవమానపరచవలెనని ఘట్టిప్రయత్నం ప్రారంభించారు. ఇంతలో ఏమి జరిగిందోమరి హఠాత్తుగా వెంకుబాయి ఆస్తి నంతా వారిసులకు అప్పజెప్పి, ఎవరికీ తెలియకుండా ఊరు దాటిపోయింది

నోటికొక మాటగా కారణాలు కల్పించుకున్నారు ఎవరో ఒక బైరాగివొచ్చాడు, అతనితో వెళ్ళిపోయిందని ఒకవార్తకూడా పుట్టింది ఆ బైరాగికర్మంకాలింది అన్నారు కొందరు. ఈ విధంగా పరారీ అయిన వెంకుబాయి రెండుసంవత్సరా లైన తరవాత ఊరు ప్రవేశించింది. ఈ వెంకుబాయి పంధా అంతా వేరు.

నున్నని తలపైనుంచి కాషాయపైట చక్కగా జార్చి, చేతిలో కమండలమూ, కాళ్లకు పాదుకలూ, రీవిగా నడుస్తూవుంటే చూసి ఆశ్చర్యపడనివాళ్ళు లేరు. నొక్కులజుట్టు తీసివేతవల్ల ముఖానికి వికారం ఏర్పాటు కాలేదు, పైగా కొత్త రీవి చేకూరింది, నొసటిమీదను ముంగురులకుటుకు తొలిగిపోవడంవల్ల చూపులకదలి కలలో తళుకులు పోలేదు, పైగా నూతనఆకర్షణ కుదురుకుంది. ఈ నాటి వెంకుబాయివిగ్రహం కల్పించేవాతావరణం వేరు, ఆనాటి వెంకుబాయివిగ్రహం కల్పించినవాతావరణం వేరు. కథకు ఎంతో మార్పుతెచ్చింది కాషాయవస్త్రం.

తాను శరీరంమీదను కల్పించుకున్న మార్పుతో వెంకుబాయి ఇతరుల మన స్సులలో మార్పును తెగరిగింది. ఈ మార్పు నెమ్మదిగా అందరినీ ఆకర్షించింది.

ఆమె వెనకటి జీవితచరిత్ర అంతా పొటిలి, ఆమె మార్పునకు అందరూ ఆశ్చర్యపడి విశ్వసించారు దేవాలయం చక్కగా తయారైంది నికరమాదాయం ఏర్పాటయింది వెనకటిసమస్తమూ ఈ కొత్తలో మాయమయిపోయింది

ఇటువంటిస్థితిలో ప్రకృతమంతా ధ్వంసంచేసుకుని వెనకటి చరిత్రతో సమస్తాన్నీ ముడిపెట్టుకుంది. ఖాదరాలీఖాన్ తోటలో కాపురంపెట్టడమే దీనికంతకూ కారణమా అంటే. అది ఒక్కటేకాదు, సాహేబు తెలివితక్కువగా జారిన మాట కూడా కారణమని చెబుతారు,

ఒకనాడు సాహేబును కదలవేతామని నియోగిరామయ్యపంతులు, 'మహమ్మదీయమతం హిందూమతానికి ఏనాటికీ తక్కువే. అని గేలిచేస్తూ అతన్ని ఉడికించి నలుగురిలోనూ 'మా వెంకటేశ్వరస్వామికి మీ బీబీనాంచారి భార్య కావడంచూడు మా దేవుడే మీ బీబీని సంపాదించాడు, మీ దేవుడేంజేశాడు ?' అని హేళన చేశాడట సాహేబు ఉడికిలి 'మాబీబీనాంచారి వెంకటేశ్వర్లకు పెళ్లామైతే మీవెంకటేశ్వర్లు నాకు వరసకు కొడుకు అవుతాడు' అన్నాడట, దీనితో కొంత గుట్టు బయటపడింది ఈవార్త విని తిమ్మాజీ రహస్యంగా ఎవ్వరితోనో 'ఈ మెదడులేని సాహేబు ఏంజేశాడు, రాత్రి గోయి కప్పిన ప్రయోజకత్వంతప్ప' అని మీసం దువ్వాడట.

ఈవార్త నోటానోటా పాకిపోయింది, ఊర్లో అందరూ అసహ్యించుకోడం మొదలు పెట్టారు కాని వెంకుబాయి అతి నిర్లక్ష్యంగా ఉన్నది. తోట అమరకం సాహేబు బాగానే చేస్తున్నాడు; తిమ్మాజీ ఆమె సహాయాన్ని అపేక్షిస్తూనేవున్నాడు, ఆమెసేవ చేస్తూనే వున్నాడు' సామాన్యప్రజ తమాషాగా చెప్పుకుంటూనే వున్నప్పటికీ దేవాలయానికి ఏ లోపం కలగలేదు.

'నమ్మకాన్నిబట్టీ, భక్తినిబట్టీ, అంతేకాని, తక్కినసంగతులు మనకెందుకు' అని నమ్మే మామూలు హిందూప్రజ, మొక్కేమొక్కులు మొక్కుతూనే వున్నారు, నయమయ్యేవారి జబ్బులు నయమౌతూనే ఉన్నవి. కానివారికి కావడంలేదు; కోరిన

వాటిలో ఫలించినవారి కొందరు ఫలిస్తున్నవి, ఫలించనివారికి ఫలించడంలేదు స్వామిఅనుగ్రహం కలిగినా ధన్యులౌతున్నారు, లేదా వాళ్ళకర్మ వాళ్ళు అనుభవిస్తున్నారు. అసలుకి విధిలో ఆరాధనకు సంబంధం ఏమిటి? ఇంతకూ ఎంత దేవుడైనా భూలోకంలో అవతరించవలెనంటే నిమిత్తమాత్రంగా అయినా ఏదో ఒక ఆశ్రయాన్ని కల్పించుకొనక తప్పనప్పుడు ఏం చేస్తాడు? ఇంతమాత్రాన వెంకుబాయి తల్లా తిమ్మాజీబి భావరాలిభానో తంత్రా ఏమైతేనేమి వెంకటేశ్వర్లు వెంకటేశ్వరులే.



## వింత ప్రకృతి

ఏదైనా సంగతి చెప్పబోయేముందు ఆ జ్ఞాపకాన్న కలిగే నవ్వులాంటి నవ్వును ఆపుకోబోయింది నాకు అన్నంవొడ్డిస్తూ గొల్లి. 'ఏంగొల్లా, ఎందుకో నవ్వువొస్తూ వున్నది' అంటే, గడప అవతల కూర్చుని, "మన యింటివెనక ఉన్న వారి అమ్మాయి సత్యవతమ్మ నేను తాళం తీస్తూవుంటే వీధికోనుంచి వెళ్తూ 'గొల్లా, ఇంత అలస్యంగా తెస్తావేమి అన్నం?' ఆని అడిగింది, తమరు ఒండిగంటదాకా రారు, ఇంకా ముందుగానే తెస్తే చాల్లారిపోతుంది అన్నాను 'అయితే ఇంకా అర గంటవరకూ రారుకదా' అంటూ తిన్నగా మేడమీదకు వొచ్చి ఎన్ని తమాషాలు చేసింది అనుకున్నారు 'వారు వొచ్చాక చెప్పకే' అని, తమ కోటు వేసుకుని, ఆ గొడుకు పట్టుకుని, తమజోళ్ళు తొడుక్కుని, 'ఇలా నడుస్తారు, ఇలా గొడుగు పట్టుకుంటారు, ఇలా తలవొంచుకుని వెళ్తారు' అని తమరి నడకలన్నీ చూపిస్తూ, మధ్య మధ్య తమరు వొస్తున్నారేమో అని ఉలికులికి పడేది 'వొచ్చేవేళ అయింది' అంటే ఇందాకే పదినిమిషాలకితం తూరీగలా పారిపోయింది," అని చెప్పింది "ఎవరైనా చూస్తే బాగుండదు అలా రానిస్తావా?" అంటే, "లేదయ్యా మనసందు మెట్లకింద వున్న తలుపుతీస్తే, అవతలకి చావడిలోనుంచి ఆవిడ మేనత్త గదిలోకి దారివుంది. అలా వెళ్ళిపోయింది, మనసందు తలుపు వేసివేస్తే వీధికోవాళ్ళకి ఏమీ కనపడదు కదా!" అన్నది. నేను ఇంకేమీ ఆవకాశం ఇవ్వక పోవడంవల్ల, గొల్లి గిన్నెలు కడుగుతూ తన పనులు చూసుకుంటూ వున్నది.

సిగరెట్టు వెలిగించి మధ్యాహ్నం "టైంటేబిల్" చూసుకుంటూవుంటే, "ఈసత్యవతి ఎవరు?" అనే ప్రశ్న, లోపల వెదుకులాడుతూవుంది జవాబుకోసం.

ఎంచవేతకో [illegible] ఊపూల రెండుమూడుసార్లు పళ్ళు తోముకుంటూ వీధిలోకి తొంగి చూసినప్పుడు, నాజూకైన పచ్చనిశరీరమూ, జారుముడివేసిననొక్కుల జుత్తూ, వింతుత్సాహం వింత సొగసునిచ్చిన నావయస్సున్న ఒక ఆమె నావైపు చూసిన ఒక చూపు జ్ఞప్తికి వొచ్చి 'ఆవిడే సత్యవతి!' అని, నన్ను తట్టిచెప్పడం ప్రారంభించింది.

ఈ మేడ అద్దెకు తీసుకుని నెల అయినప్పటికీ, కింది భాగంలో అవతలియింటి వారి బంధువులాలు ఒక పెద్దావిడ ఒంటరిగా కాపురం ఉన్నదని తప్ప ఇంకేమీ ఇరుగుపొరుగుభోగట్టా నాకు తెలియదు.

మళ్ళీ రాత్రి గొల్ల వొడ్డిస్తూవున్నప్పుడు వింతవింత ఊహల ఆత్రుతలు కలిగినవి. నేను భోజనం చేస్తూవుండగా గొల్ల పనిమీదను వెళ్ళినట్టూ, మెట్లకింద ఎవరితోనో అక్కడి తలుపుదగ్గర మాట్లాడుతూవున్నట్టూ, నాకు తగిలిన అనుమానం ఉద్దీపన అయింది గొల్ల అంటుపెట్టి పక్కవేసి, మిగిలిన అన్నం పట్టుకుని మెట్లు దిగిపోయింది సిగరెట్టు పూర్తిచేసి, కిళ్ళీ వేసుకుని మెట్లుదిగాను. గొల్లమనిషి సందుదాటిపోయేవరకూ చూసి, తలుపువేసేసి, మొదటిమెట్టు ఏక్కేటప్పటికి, సత్యవతిప్రశ్న గుండెలమీద వేలుపెట్టి ఆగమని శాసించింది విధేయుణ్ణి. ఐంకుతూ మెట్లకింద తలుపుదగ్గర నిలిచి, చప్పుడు కాకుండా గొళ్ళెం తీశాను నెమ్మదిగా తోస్తే అవతల ఘడియ తీసిఉన్నట్టూ తలుపు జరిగేటట్టూ వున్నది, ధైర్యానికి తగినంత కారణం! నెమ్మదిగా ఒకరెక్క తోశాను తెల్లవిర అ తలుపుచాటుకు తప్పుకుంది లోపలకు అడుగు వేసి చూస్తే సత్యవతి తలవొంచి పైటను కొన గోళ్ళతో గీరుతూ నిలబడివుంది చేయి పట్టుకున్నాను చేయి నావైపు వొచ్చివేస్తూవుంటే తాను లాక్కుంటూ వున్నట్టు లాగుతూ, ముసిముసినవ్వుతో "ఏమిటీ చొరవ?" అన్నది "కోటు తొడుగుకుందువుగాని రా!" అని దగ్గరకు లాగి, నా ఎడమచేతిమీదకు వాల్చి రెండుపెదవులూ నొక్కివేశాను, ఒక్క తీరని ముద్దుతో, కుడిచేయి నాభుజం మీదకు కౌగిలిచ్చి, ఎడమచేతి వేళ్ళు నాజుట్టులోకి పోనిచ్చి, కళ్ళు తేలవేసింది, ఊపిరిరాగానే ఒక్కసారి వొంగి కుడిచేయి మోకాళ్ళకిందకు

పోనిచ్చి చేతులలోకి యెత్తుకున్నాను కులుకుతూ బుగ్గమీద చిట్టిదెబ్బకొట్టింది. గుమ్మం దాటి ఇవతలకు తెచ్చి మెట్లు ఎక్కబోయాను. "అమ్మో, మీకు ఆయాసం" అంటూ దిగబోయింది. నేను వదలకుండా "మల్లిపువ్వులా ఉన్నావు!" అంటూ మెట్లు ఎక్కిపోతున్నాను. అనుకున్న ఆమె కుడిరొమ్ము మీదకు నాగుండె దూకుడుగా కొట్టుకుంటూన్నది. సత్యవతి కుడిచేతితో నామెడ చుట్టుకొని వెర్రిముద్దుల వేడితో నా బుగ్గను సొమ్మసిల్లజేస్తూవుంది ఆ వొళ్ళుతెలియనితనంతో అట్లా తెచ్చి నాపక్కమీదను దింపి, కొల్లగొట్టితెచ్చుకున్న అమూల్యతను 'ఇక నాది' అనేధీమాతో దిగ్విజయంచేసినవాడు చూసుకునే నిండు గర్వంతో 'నా' అయిపోయిన సత్యను చూసుకున్నాను

* * * *

ఈ సత్యవతిస్నేహం నానైతికజీవితానికి ఒక అద్భుతమైన మార్పును తెచ్చింది. మనుచరిత్ర మొదటి రెండాశ్వాసాలనూ, రెండు మహాసామ్రాజ్యాలను తమ సయ్యాటలకు కొల్లగొట్టి ఒకరికివొకరు చెందనప్పుడు మృత్యువునే ఆహ్వానించుకున్న ప్రేయసీప్రియుల కథను షేక్సపియర్ తన చిక్కబడిన కళతో చిత్రించిన ఏన్టొనీ క్లియోపాత్రాల మహానాటకాన్నీ, బి ఏ పరీక్షకు తీవ్రంగా నేను చదవవలసినరోజులు అవి. చదువు ప్రారంభించి ఎన్నోసార్లు కొన్నిఘట్టాలలో కళ్ల తెరుచుకునే కలలలో పడిపోయేవాణ్ణి ఒక్కపూటఅయినా చదువు పాఠికపంక్తులు దాటేదికాదు. భావనాప్రపంచంలోని విచిత్రవిహారాల ఆకర్షణకు లొంగిపోకుండా యింద్రియాలను అణిచిపెట్టే నిగ్రహంలో మనస్సునకు ఆరోజులలో కలిగే వెర్రి పరుగుల వైచిత్ర్యం అది.

ఇంత వలపు సన్నిహితత్వం, ఇటువంటి స్త్రీస్నేహం ఇదివరకు యెరగని నాకు, సత్యవతి రాకతో అద్భుతమైనమార్పు కలిగింది. ఇప్పుడు నాకు చదువు చక్కగా సాగుతుంది. అంతేకాదు, సమస్తమూ స్థిరంగా మెదడుకు పట్టుతుంది. అర్థంలేని వెర్రికలలూ, మృగతృష్ణలకోసం పరుగులెత్తే పిచ్చిఊహలూ ఆగిపోయినవి నాకు ఇతర ఆలోచనలులేవు. నాఊహలు ఇదివరలో పోయే వికృతపు దారు

లకు పోషు. ఆందువేత వారిని ఎంత్రజేయలే. వదలగూలే, నేను వడే విశ్వత వేదనా లేదు మొత్తం మొద సత్యవతి స్నేహితంగా నాకు కుదురు యిచ్చింది;

కాని నాపెంపుడు ప్రకృతికి ఇది భయంకరమైంది, ఇరుగు పొరుగువారికి అప వాదు లయింది ఇంతకూ సత్యవతి వితంతువు, నేను బ్రహ్మచారిని సత్యవతి మేనత్త నాకు పెళ్లాడి పోయినా మమ్మల్ని ఎంతో ఆదరిస్తూవుంది కిందటిసారి నాకు జ్వరంవొచ్చినప్పుడు సత్యవతిపిల్ల రహస్యంగానే పైకివొచ్చి నాకు ఉపచారాలు చేసింది. ఏది కుపితత్వంవల్ల వైధవ్యంపాలయిన ఆ పిల్లపైన వాళ్ళకు ఎంతోజాలీ ఆదరమూ, నాయందు వాత్సల్యమూ, అభిమానమూ సత్యవతిగురించి వీరికన్నా బాధపడవలసినవారు మరెవ్వరూలేరు మా స్నేహం ఇతరులకు బాధకరంకావడం ఎందుకో ఇప్పటికీ నాకు అర్థంకాదు ఇంతకూ నత్య రాకపోకలు ఇతరుల కంట పడడానికి అవకాశంలేదు ఊహించడానికి అనుమానకారణాలైనా లేవు గొల్లకు కూడా ఇప్పటివరకూ తెలియదు. ఎల్లా మాసంగతి బయటపడిందో నేను గ్రహించ లేకపోయాను. సత్యవతి చురుకైనదీ తెలివైనదీకూడా ఈప్రశ్న వేస్తే "ఏంచేస్తారు. మనకేం? అయినా నాకు ఒక అనుమానం వున్నది, రెండురోజులలో కనిపెట్టి చెబుతాను ఉండండి" అన్నది.

మర్నాడు మధ్యాహ్నం నేను మెట్లుదిగి వొస్తూవుంటే దొందరగా సత్య ఎదురువొచ్చింది పైకినమ్మని చేయిపట్టుకుని లాక్కుపోయి, లనివెంటలోని పొట్లం విప్పి. దానిలోనుంచి ఒక ఫాజా ఏసి పీపివేపుకిటికీవద్దకు తీసుకువెళ్ళి, తాను కిటికీ పూచలమీదకు వొరిగి, నన్ను తనమీదకు లాక్కుని, ఫాజా నానోట్లో పెట్టి సఖం కొరుక్కుంది ఇంతవరకూ నేనువెస్తున్న ప్రశ్నలకు ఉండమని ఆపుజేస్తూ వొచ్చింది "ఏమిటి ఈ అల్లరి?" అంటే, "అల్లా వెంటబరల్నం దొడ్డిలోకి చూడండి" అన్నది ఆ దొడ్డిలో అతిసిధార్య సూరమ్మ పాకచాటున నిలబడి మమ్మల్ని మైమరిచిచూస్తూవుంది నేను ఇవతలకు లాగబోతే సత్య నన్ను గట్టిగా మీదకు లాక్కుని రెండుచెంపలమీదా చిట్టిదెబ్బలు కొట్టి, "నా అనుమానం తీరి పోయింది, మనమీదిఅల్లరికి ఎవరు కారణమో చూపిస్తాను, ఇక్కడే నిలిచి

ఈ కిటికీలోనుంచే చూస్తూవుండమంది, ఇప్పుడే వొస్తాను" అంటూ పరుగెత్తుకుని వెళ్ళిపోయింది

ఏదో విశేషాన్ని చూపెడుతుందని నాకూ వింతగా తోచింది కిటికీలోనుంచి చూస్తే సూరమ్మ ఆ పాకవద్ద అట్లానే నిలుచుని, నావైపే చూస్తూవున్నది కిటికీపక్కకు తప్పుకుని నెరియలోనుంచి చూస్తున్నాను ఇంతలో సత్యవతి పాకపక్కనుంచి వొచ్చి, సూరమ్మకళ్ళు మూసింది సూరమ్మ చేతులు విదుల్చుకుని సత్యవతిని గట్టిగా కౌగిలించుకుంది సత్యవతి కిటికీవేపు చేయి చూపింది, నన్ను కనబడమన్నట్టు ఏమిటో తమాషాఅని కిటికీ యెదరకువొచ్చి నిలుచున్నాను సూరమ్మ నాకేసి చూస్తూ సత్యవతిని ముద్దుపెట్టింది ఒక్కక్షణం చూశాను. నా కేమీ అర్థంకాలేదు. కాలేజీకి వేళ అవుతూవుంది పుస్తకాలు తీసుకుని తాళంవేసి బయలుదేరాను. వెంకటరత్నం వీధితలుపు వేసేవున్నది కాని పక్క కిటికీదగ్గిర సూరమ్మా సత్యవతీ చెట్టాపట్టాలు వేసుకుని నిలుచున్నారు నన్ను చూస్తూ సూరమ్మ సన్నగొంతుకుతో ఏదో అన్నది, కాని నాకు బాగా వినబడలేదు నడుస్తూవున్నంతసేపూ, కాలేజీలోనూ నాకు ఇదే ఆలోచన. సూరమ్మ మొత్తంమీద గమ్మత్తు మనిషే' ఈవిడచర్య మొదటినుంచీ తమాషాగానే వున్నది

సూరమ్మ పెద్ద అందమైంది కాదు, కాని మొత్తంమీద చక్కనిదే. ఆవిడ శరీరం కొంచెంలో ఒక చక్కనిచెప్పు వున్నది. ఇంటిపనులు వొళ్ళువొంచి చేయడంలో, నాజూకునుకు భంగంలేకుండా శరీరానికి కలిగే పటుత్వమూ ఆరోగ్యమూ ఆవిడసొమ్ము కాపుస్త్రీలకు సహజంగావుండే, ఒక దానికి ఒకటి వొప్పి, తీర్చిన బలమైన అవయవాలు ఆవిడవి నేను ఈ మేడమీద దిగిన మూడవనాడు ప్రారంభం సూరమ్మకథ.

సాయంత్రం ఊరికే డాబామీదనుంచి వీధిలోకి చూస్తూ నిలుచున్నాను. ఇంతలో సూరమ్మ దొడ్డిలోకి వొచ్చి నా వైపు చూసింది నేను ఆవిడ్ని చూసికూడా పరధ్యాన్నంగా ఉన్నాను. ఇంతలో అట్లాగే నావేపుచూస్తూ బట్టల్ని జార్చివేస్తూవుంది స్నానానికి. నేను వెనకకు తప్పుకుని ఇవతలకు వొచ్చేశాను ఇంతేకాదు, వీధే నేను

వెళ్తూవుంటే తరుచు కిటికీవద్ద నిలుచుని, కాపుస్త్రీ కామోద్రిక్త అయినప్పుడు సహజంగా మానే వేడిచూపు చూసేది

రెండవగంట లైబ్రరీక్లాస్ ఎగవేసి ఇంటికి వొచ్చేశాను మెట్లకిందితలుపు చప్పుడుచేస్తే మేనత్త సత్యని పిలిచిపెట్టింది, సత్య 'నాసంగతి చూశారా!' అన్నట్టు గర్వంమొహం పెట్టి మెట్లమీదనే నన్ను కూర్చోబెట్టి చెప్పింది, మధ్య మధ్యను గిల్లుతూ "సూరమ్మకి మీ మీదను చాలాయిష్టంగా వుంది. ఒకరోజున నీళ్ళు పోసుకుంటూవుంటే చూశారటకూడా, రోజూ మీరు దారే వెళ్ళేటప్పుడల్లా కిటికీ దగ్గిర నిలుచుంటూవుందటకూడా, మీరు దొంగలు, నాతో చెప్పనైనాలేదు. నేనేం ఈర్ష్యగలదాన్ని కానులేండి, కట్టుకున్నపెళ్ళాన్ని కనుకనా! ఇంతకీ స్నానం చేసేటప్పుడు చూసి మీరు వెనకకు వెళ్ళిపోయారట దాన్నిబట్టి మీరు అటువంటి వారుకారు అనుకున్నదట అప్పుడు తరవాత మనసంగతి కనిపెట్టివేసింది చాలా తెలివైందిలెండి! సూరమ్మకి నాకూ, చాలా స్నేహం ఎన్నాళ్ళనుంచో, వెంకట రత్నం తాసిల్దారు ఆఫీసులో డఫేదార్ అతను తాసిల్దారుతో కమాను వెళ్ళినప్పు డల్లా నేను అక్కడనే పడకోవడం మామూలు, అతను మళ్ళీవొచ్చేవరకూ మే మిద్దరం ఇంట్లో మహా అల్లరిచేస్తాం. ఇది అలవాటు అయిపోయింది, ఈమధ్యను వెంకటరత్నం రెండుసార్లు ఊరికి వెళ్ళాడట నాకు ఆ ధ్యాసన్నమేపోయింది, ఆసంగతే తట్టలేదు మన గోలలో నేను రాకపోవడం చూసి సూరమ్మ అనుమానించి ఈమేడ కనిపెట్టడం ప్రారంభించింది. ఎట్లాగయితేనేమి గ్రహించింది. నేను తనతో చెప్ప లేదని ఉడుకుమోతుతనం వొచ్చిందట ముందు ఇంతలో తాను కిటికీదగ్గర నిలిచి మిమ్మల్ని రోజూ చూస్తూవుండడాన్ని వెంకటరత్నం అనుమానించి ఆవిణ్ణి కొం చం ఖంగారుపెడితే, అతని అనుమానం మరొకదారికి పడిపోడానికీ, మనమీది ఉక్కురోషతనంచేతా, మనసంగతి చూచాయగా అనేసిందట అతనికి మెదడు ఏమీలేదు; ఆవిడ ఎట్లా ఆడిస్తే అట్లా ఆడతాడు, ఉత్త జంతువు, సూరమ్మమీద మహా అనుమానం, మీరు అటువంటివారుకారు అనే ధైర్యంతో పెళ్ళాం మిమ్మల్ని చూస్తూవున్నప్పటికీ ఊరుకున్నాడు ఇన్నాళ్ళూ మనసంగతి చెప్పగానే కంగారు పుట్టింది. నలుగురితోనూ ఈసంగతి చెప్పి హెచ్చరిస్తూన్నప్పటికీ మీరంటే ఎందుకో

జంకుగాకూడా వున్నది లేకపోతే ఈపాటికే చాలా అల్లరిచేసేవాడు, సూరమ్మని నేను ఘట్టిగా చివాట్లు వేశాను. పాపం. నిజంచెప్పి ఏడ్చుసుంది. 'అతని అనుమానంనుంచి తప్పుకోడానికీ, నీమీద ఉడుగుదోతుతనంచేతా అల్లా చెప్పాను, అయినా ఫరవాలేదు, అతని నోరుకట్టేస్తానులే' అన్నది. ఇక భయంలేదు, ఏమయితే మనకేమిలే" అన్నది.

మార్నాటికే సూరమ్మ ఏమాత్రం వేసిందోకాని. వెంకటరత్నం అనుమానిస్తూ ఉన్నట్టున్నా, ఈసంగతి సంప్రతించకుండా ఉండడమూ, ఇతరులు సంప్రతించినా 'ఎందుకు వొచ్చినగోల' అని తప్పించడమూ ప్రారంభించాడు అయినా, సూరమ్మతో ప్రారంభమై వెంకటరత్నంతో బయటపడిన అపవాదు, వాళ్ళు సర్దుకున్నప్పటికీ దాని దారి అది మానలేదు. ఆనోటా ఆనోటా వీధంతా పాకింది మూడవపెళ్ళి భార్య అప్పుడే కాపురానికి వొచ్చిన ఎదరింటి సిద్ధాబత్తుడు నలుగురినీ కలియగట్టడం ప్రారంభించాడు నాలుగురోజులయ్యేప్పటికి వీధంతా ఒక విచిత్రంగా తయారైంది. కొందరు మగవాళ్ళు తటస్థం, కొందరు పూర్తిగా వ్యతిరేకం, సత్యవతికోసమని ఇదివరలో ప్రయత్నాలు చేసి తిట్లుతిన్న కుర్రవాళ్ళు కొందరు నన్ను వీధిలోనుంచి పంపించి వేయవలెనన్నంత పట్టుదలతో నామీదను కక్ష. ఏది ఎట్లావున్నా అతివింతగా స్త్రీలు చాలామంది నాపక్షం.'ఆయన తలయినా ఎత్తిచూడరు యెంతోపెద్దమనిషి' ఆ పుస్తకాలుఏమిటో ఆ చదువుఏమిటోఅంతే, ఎవరో ఒకరోయిద్దరో స్నేహితులు, వారైనా ఎప్పుడో కాని రానేరారు; ఎంత అణకువ, ఎంత నెమ్మది, ఆయనమీద ఈపుకార్లు ఏమిటి?' అని వాదించడం మొదలుపెట్టారు. సత్యవతికి మాత్రం ఇదంతా తమాషాగానూ, సర్దాగానూ వున్నది మధ్యాహ్నం ఉబుసుపోకకు కూర్చున్నప్పుడు అమ్మలక్కలంతా ఈసంగతే చెప్పుకుంటున్నా నన్ను పొగుడుతూనే వున్నారు. నేను కాలేజీకి వెళ్తున్నప్పుడు నలుగురయిదుగురు స్త్రీలు "తలఅయినా ఎత్తరు" అని నాకు వినబడేట్టుగానే అంటూ వొచ్చారు కొంచెం ఎక్కువ యౌవనంలో వున్న ఇద్దరు నేను వాళ్ళ గుమ్మందగ్గరకు రాగానే "సత్యవతి" అని ఏదో చెప్పుకుంటూవున్నట్టు నటించేవారు.

మళ్ళీ పదిరోజులు అయ్యేటప్పటికి అంతా ఒకవిధంగా సర్దుకుంది ఎప్పుడూ

నాయెదరకు ఏమీ అనలేకపోయినా నాచెవినిపడేటట్టుగా వంకరమాటలు అనేవారు కూడా కొందరున్నారు. సత్యవతి ఒకమారు చెప్పగా: 'ఆడవాళ్ళంతా మిమ్మల్ని అంతమంచివారు అంటారు ఎందుచేతనో?' అన్నమాటలో ఏమయినా అర్థం వున్నదేమో?

పరీక్షలు పదిహేనురోజులే ఉండడంవల్ల రాత్రి అధమం ఒంటిగంటవరకైనా చదివేవాణ్ని అప్పటికి ఒకనిద్రతీసి లేచి, సత్య బలవంతంగా అయినా దీపం ఆర్పివేసేది మొత్తంమీద అనుమానం అయినా, నిర్ధారణఅయినా, వీధంతా సూరమ్మ మూత్రపడిన వెంకటరత్నం స్థితికి వొచ్చింది

ఆఖరిపేపరు రాసివేసి, 'వొదిలిపోయిందిరా' అన్న భావంతో కాలేజీనుంచి ఇంటికి వొస్తూవుంటే వీధి అరుగుమీదను మట్టకాలుస్తూ కూర్చున్న వెంకటరత్నం తొందరగా చుట్టపారవేసి, నిలబడి, బాబూ "పరీక్ష బాగాయిచ్చారా, పేసవుతారా?" అని అడిగాడు "బాగానే రాశాను. తప్పకుండా పేసవుతాను" అన్నాను నాకు కనపడుతూ తలుపువక్కనే సూరమ్మ నిలుచునివుంది, వీధిలో నలుగురయిదుగురు గుమ్మాలలో నిలచి అలకిస్తూ చూస్తున్నారు "తమరు తాతగారిలా మళ్ళీ తాసిల్దారీ చెయ్యాలి, తమరు ఎక్కడ తాసిల్దారీ అయితే అక్కడికి నేను ట్రాన్స్‌ఫర్ చేయించుకుంటాను" అన్నాడు సూరమ్మ తలుపువక్కనుంచి కనపడేటట్టు ఒక అడుగు ఇవతలకు వొచ్చి "ఆ, ఆదేమిటి, తాసిల్దారుగా తప్పకుండా మనవూరే రావాలి" అన్నది.

నేను తలుపుతాళం తీస్తూవుంటే, వీధంతా సూరమ్మా వెంకటరత్నమూ నాకు వొస్తుంది అనుకుంటూవున్న గౌరవం, వొచ్చినట్టే చూస్తున్నారు. లోపలకు తిరిగి తలుపు ఘడియవేసేప్పటికి మెట్లమీదనుంచి మీదకు వొచ్చి, "తాసిల్దారుగారూ గుడ్‌నైట్" అన్నది, సత్య దగ్గరకు తీసుకుని, "మరి మనం పెళ్ళిచేసుకుందాం", అని నా అభిప్రాయాన్ని తెలిపాను, అతిహేళనగా "పెళ్ళా! నాకేంపెళ్ళి చదువుకున్నవాళ్ళకి ఇట్లా మతులుపోతూన్నవేం? ఇది మరీ అందంగా వున్నది, మంచి వెధవ రెండోపెళ్ళికూతుర్నే సంపాదించుకున్నారు!" అంటూ నాబుగ్గలు నులిపి,

నేను మాట్లాడబోతూవుంటే, దగ్గరకు ముడుచుకున్న తన సన్నని పెదవుల్ని నా నోటిమీద నొక్కి ఊపిరి తెలపనిచ్చిందికాదు.

శరీరోద్రేకాన్ని ఈషణ్మాత్రమూ ఆపలేకపోయినా, వివాహమన్న ఊహ సైతం కదలకుండా, మానసికబానిసగా ఈసంఘం వింతప్రకృతి తయారుచేసిన ఈ వ్యక్తి మనస్సులో ఏభావాలు ఎట్లాఉన్నవా అని చూస్తూవున్న నాకళ్లలోకి అర్థం లేవి అమాయిక ప్రేమతోనూ, ఆవేశంతోనూ చూసింది.



# అహింస

నేను మెట్లు ఒక్కొక్కటి నెమ్మదిగా దిగివొస్తూవుంటే, అయ్యరు గుమ్మంకేసిచూడడం అభ్యాసంవేసుకున్న నాచూపు అవేపే పోయింది అయ్యరు పడకకుర్చీలో పడుకుని, ఇనపతనాబీ కేసి అర్థంలేని శూన్యంచూపు చూస్తున్నాడు ఆమె కిటికిలో కూర్చుని బయట అరుస్తూవున్న కాకిని, 'ఈజీవితానికి వార్తలుకూడానా' అన్నట్టు విస్పృహగా చూస్తూవుంది.

మూడు నెలలైంది, అయ్యరు ఇక్కడకు కాపురానికివొచ్చి. నేనూ మరిద్దరు స్నేహితులూ పైఅంతస్థులో బ్రహ్మచారులుగా జీవిస్తున్నాం. ఈరెండో అంతస్థులో అయ్యరూ ఆమె తప్ప మరెవ్వరూ లేరు ఆమె అయ్యరుభార్య అనుకునేవాళ్ళం, కాని వాళ్ళజీవితవిధానం చూస్తూవున్నకొద్దీ అనుమానాలు కలిగినై. వితంతువు ముఖాన్ని స్థిరంగా ఆవహించే శూన్యం ఆమెముఖంలోనూ, దుఃఖంతోకూడుకున్న దీర్ఘమైన చూపు అతని కళ్ళలోనూ, చిరస్థాయీలుగా మాకు కనబడేవి మా అద్వైతవాది దక్షిణాదివాళ్ళంతే, జాతిలక్షణం అది, నిష్కామంగా దాంపత్యం గడపడం అనేవాడు బలవత్తరమైన కారణం యేదో వుంటుంది అనుకునేవాణ్ణినేను. రామం, వీళ్ళు భార్యాభర్తలు కారేమో అనేవాడు మొత్తంమీద వాళ్ళేదో దిగులుగా దుఃఖంగా వుంటూన్నట్టూ, అన్యోన్యతలేక తప్పనిసరిగా కలిసి జీవిస్తూవున్నట్టూ, వుండేది అనేకసార్లు పలకరించుదామనుకున్నాను కాని అయ్యరు మమ్మల్ని చూడగానే మొహం పక్కకు తిప్పేసేవాడు ఆమె గోడపక్కకు తప్పుకునేది. ఆంధ్రులంటే వుండే అనుమానమే అనుకునేవాళ్ళం. అద్వైతవాదికి కొంచం క్రోధంగాకూడా వుండేదీ వాళ్ళ చర్య. 'అవమానం' అనేవాడు. ఈవింతయేమిటా అనే

ఆశ్చర్యంకన్నా, ఎందుకిట్లా వుంటారా అనే జాలి, నాకు యెక్కువైంది. కష్టాల మధ్య జీవించడం దుర్భరంకాదు, కన్నీళ్ళలో ఈదుతూ దుఃఖంలో బ్రతుకు గడపడంకూడా అంత భయంకరంకాదు, కాని శూన్యంలో, నిస్తేజంలో నిలవడం ఊహకైనా నరకం. వాళ్ళ మొహాలను చిరునవ్వు కదిలి ఎన్నో సంవత్సరాలైవుంటుంది, ఆనందం అనేది జీవితంచెరగులనైనా తాకినట్టు కనుపించదు. పాపం పలకరించి చూదామా అనుకుంటే, ఏమని అపోహపడిపోతారో అని జంకుకలిగేది.

మామూలుగానే అటుపోయిన చూపును ఇటు మళ్ళించబోయేటప్పటికి స్వప్నంలో కదిలినట్టు, అప్రయత్నంగానా అన్నట్టు, అయ్యరు కుర్చీలోనుంచి లేచి గుమ్మందగ్గరకు వొచ్చి నావైపు చూశాడు, నేనూ చూశాను. ఒక్కత్రుటి ఆగి 'షికారువెళ్తున్నారా?' అన్నాడు మంచి తెనుగులో అవును మీరూ వొస్తారా అన్నాను లోపలికిపోయి ఉత్తరీయం తెచ్చుకుని నావెంట వొచ్చేశాడు, ఆమెతో యేమీ చెప్పలేదు నామనస్సుకూడా నాలోదించి దాటి అయ్యరు సృష్టిస్తూవున్న వాతావరణంలో పడిపోయింది, యిద్దరం యంత్రాలలా నడిచిపోతున్నాము ఎందు చేతనో నేనూ మాట్లాడలేదు అయ్యరు సరే మాటలేదు చిత్తరంజన్ ఎవెన్యూ దాటి పోతున్నాము. బస్సు ఎక్కుదామా అనేవూహకూడా పుట్టలేదు, యంత్రాల లాగే ఇద్దరం 'చౌరంగీ' చేరుకున్నాం మైదానంలో నిర్జనంగావున్న వొకచోటు చేరి,కూర్చున్నాం పచ్చికమీద అయ్యరు కళ్ళెత్తి నాకేసి వొకసారి చూశాడు, నేనూ అయ్యరుకేసి అదేవిధంగా చూశాను రాబోయే వర్షాన్ని సూచిస్తూన్న కారుమబ్బుల మీద తళుక్కున్న మెరుపులాంటివి అతని చూపులు రెండు నిమిషాలు మళ్ళీ మౌనంగా కూర్చున్నాము. ఇక తప్పదని నేనే 'అయ్యరూ, చాలాకాలంనుంచి మిమ్మ పలకరించాలనుకుంటున్నాను' ఇంకా ఏదో అనబోతున్నాను. చప్పుమని నాదగ్గిరగా జరిగి, వొణుకుతూ నాచేతిని పట్టుకుని నాకళ్ళవేపు చూశాడు ఏదోచెప్పబోతూ; అతని హృదయం విరిగిపడడానికి పొంగుతూవున్న సముద్రంకెరటంలా వుంది. నా చెయ్యి గట్టిగా నొక్కుతూ కంపిస్తూ అన్నాడు:

"మీరు చాలా చదువుకున్నవారు, చాలా తెలివైనవారు, ఎంతో మంచివారూ

అని విన్నాను అనేకసార్లు మీతో ప్రసంగించవలెననుకున్నాను . నేను వెర్రి గా మాట్లాడుతున్నా ననుకోవొద్దు; ఒక బాధ నా జీవితాన్ని కాల్చివేస్తూవుంది. మీ సలహా కావాలి. నన్నేమీ అనుకోకుండా దయచేసి చెప్పవలె " యిదంతా యెందుకు అసలుసంగతిచెప్పు' అన్నాను "ఏదో వింతగా మాట్లాడుతున్నా ననుకో వొద్దు, క్షమించండి" అన్నాడు:

"నాసైకిల్ మాయింటివరండాలో భద్రంగానే పెట్టుకున్నాను. దాన్నిఎత్తుకు పోవడమంటే అత్యంతసులభమైన పనికాదు, ఎంత గుండెలుతీసిన బంటు కయినా; నేనూ ఒక కన్నువేసి తగినంత జాగరూకతతోనే చూసుకుంటున్నాను; అయి నప్పటికీ ఆసైకిల్ పోయింది, ఇంకా తగినంత జాగ్రత్త తీసుకొనక పోవడం నా లోపమేనా లేక ఎంత జాగ్రత్తగావున్నా ఈపాడు ప్రపంచకంలో దుర్మార్గాలు తప్పవుకనుక అది మన లోపం కాదు, సృష్టిలోపమే అంటారా?" అన్నాడు.

'అయ్యరూ, నీవు లోపలవున్నది ఏదో చెప్పడానికి వీల్లేక ఇలా ఉపమా నంలో ఇమిడ్చి చెప్పావు నీరహస్యం తెలుసుకుందామని కాదు' అంటున్నాను. అయ్యరు "ఎందుకులెండి, అసలుసంగతే చెప్తాను కాని చాలా రహస్యంగా వుండాలి మీరు. అంతే కాదు, బాగా ఆలోచించి ధర్మమయినసలహాకూడా యివ్వ వలె"నన్నాడు. కథ ఇది.

అయ్యరు అదివరలో కలకత్తా యెరగడు. కంపెనీవాళ్ళు ఉద్యోగమిచ్చామని రాయగానే భార్యను తీసుకుని సరాసరి వొచ్చేశాడు. కలకత్తాలో చాలామంది దక్షి ణాదివాళ్ళు ఉన్నారని తెలిసినా వాళ్ళ సహాయ్యాన్ని అపేక్షించలేదు. వొచ్చిన మర్నాడే కాపురానికి ఇల్లు కుదుర్చుకున్నాడు అద్దె చవుక అనీ, ఆఫీసుకు దగ్గరగా వుండడంవల్ల వేరే ట్రేం బస్సు ఖర్చులు ఉండవనీ, కనుక్కార్తిపడి మహమ్మదీ యుల షాపులువున్న గల్లీలో రెండో అంతస్థంతా అద్దెకు పుచ్చుకున్నాడు భార్య గోలపెట్టిందట: 'షాపులమధ్య—అందులోనూ అంతా మహమ్మదీయుల మధ్యను, ఏసంసారాలూ లేనిచోట, ఇరుగూ పొరుగూ ఏమీ లేనికడ, పరరాష్ట్రంలో ఇదేమిటి, నాలుగు సంసారా లున్నచోటు చూడండి' అని. కాని అయ్యరు,

సంసారాలుండే చోట ఇన్ని గదులూ ఇంత సదుపాయమూ వున్నమేడ ఇంత చవుకగా దొరకదనీ, పైగా ఆఫీసు దగ్గర ముక ట్రాం ఖర్చు తగ్గుతుందనీ, సంసారాలున్న చోటైనా ఈ బెంగాలీలు పై రాష్ట్రాలవారితో అందులోనూ ముఖ్యంగా 'మదరాసీ'లతో కలియరనీ చెప్పి ఆమెను మాట్లాడనివ్వాటు కాడు భర్తకుయెదురాడడమే సుశీలానికి లోపమనీ, అతను ఎంత తెలివితక్కువగావున్నా తెలివితేటలని కూడా నోరునొక్కి గప్‌చిప్ చేసుకోవడం ఉత్తమలక్షణంగా హిందూ సంఘం తయారుచేసిన భార్య గనుక, లోపల తోస్తూవున్న కష్టాన్ని దిగమింగుకుని, భయంగా వున్నప్పటికీ భరించి ఊరుకుంది

రోజూ అయ్యరు భోజనంచేసి తాంబూలం వేసుకొని ఆఫీసుకు వెళ్ళగానే ఆమె ఇల్లు సర్దుకొని, డాబామీదఉన్న పైపువద్ద స్నానం చేసి భోజనంచేసేది. మధ్యాహ్నం ఒంటిగంటవరకూ చాపమీద దొర్లి కాలక్షేపం చేసి, తరవాత కాఫీ తయారు చేసేది రెండింటికి అయ్యరు కాఫీతాగి ఆఫీసుకు పోయిన తరవాతనుంచీ సాయంత్రం వంటవేళవరకూ ఆమె బ్రతుకంతా ఖాళీ. ఏమీ తోచేది కాదు చదువుకుందామా అంటే పెళ్ళినిమిత్తం చెప్పించిన చదువేకాని విస్తారంరాదు గాత్రం చాలా చక్కనిదే, అయినా సంగీతంకూడా పెళ్ళి కుదురడానికి చెప్పించిందే. అక్కడికీ ఏదో అస్తమానం పాడుకుంటూ వుండేది. ఇట్లా దినాలు జరుగుతున్నై, మందంగా, నిస్తేజంగా, అర్థవిహీనంగా, జీవితాన్ని నీసంబరువుతో ఎక్కడికో దిగలాగుతూ.

మామూలు హిందూస్త్రీలంతా అలవాటుపడిపోయిన ఈ మగతలో, ఈ నిరర్థకతలో జీవితం అప్రయత్నంగా గడచిపోవడానికి వీలులేకుండా ఆమెకు ఒక దుర్భరస్థితి ప్రాప్తించింది డాబామీద పైపుదగ్గిర కిందషాపుల్లోని మహమ్మదీయులు కూజాలతో మంచినీళ్ళు పట్టుకుంటారు,

పైలాపచ్చీసులోవున్న ఇద్దరు తుంటరి కుర్రవాళ్ళు సరిగ్గా ఆమె స్నానం చేసేవేళకే నీళ్ళకు తయారుకావడం ప్రారంభించారు. వాళ్ళ చర్యలూ, చూపులూ ఆమెకు అనుమానాస్పదం కావడం ప్రారంభించినై.

మనస్త్రీల మామూలుప్రకారం ఆమె చీర సగం శరీరాన్ని ఉండగా, తక్కిన సగం ఉతుకుతూవున్నప్పుడూ, ఉతికిన భాగం వొంటికి చుట్టబెట్టుకుంటూ రెండో భాగం విడుస్తూ వున్నప్పుడూ, వాళ్ళ చూపులూ వాళ్ళ ఆలోచనలూ ఆమెకు బాధ కరంగా తోచినవి.

రాత్రి అయ్యరుకి చెప్పి గోలపెట్టింది 'ఈ మహమ్మదీయులమధ్య భయంగా వున్న'దని 'వాళ్ళే పోతారులే' అని నిద్రపోయాడు మర్నాడు, వాళ్ళు నీళ్ళు పట్టుకుపోయేవరకూ ఆగి తరవాత స్నానానికి వెళ్ళింది కాని ఆమెస్నానం సగం అయ్యేప్పటికి వాళ్ళు మళ్ళీ కూజా తెచ్చారు. ఈసారి ఆమె స్నానం చేస్తూండ గానే దగ్గరకు వొచ్చి నీళ్ళు పట్టుకుంటామన్నారు ఆమె అసహ్యించుకుంటూ కాదం టూవున్నా నీళ్ళు పట్టుకుని నవ్వుకుంటూ వెళ్ళి జేబురుమాలు తడిపి, డాబామీద ఆరవేసి, అది ఆరేవరకూ ఆగినట్టు అక్కడ కూర్చున్నారు, గమ్మత్తుగా ప్రవర్తిస్తూ ఆమె తొందరగా స్నానంచేసి లోపలకుపోయి తలుపువేసుకుంది.

మళ్ళీ రాత్రి భర్తతో చాలా బాధపడుతూ చెప్పింది. 'ఈసారిచూసి వాళ్ళ పెద్దలతో చెబుదా'మన్నాడు వాళ్ళ చర్యలకన్నా అయ్యరు నిర్లక్ష్యం యెక్కువ బాధ పెట్టింది. ఏం జేస్తుంది తన కర్మానికి లోపల లోపల యేడ్చుకుంది.

ఆ మర్నాడు పైపుదగ్గరకు పోడానికే హడలు పుట్టింది. చాలా ఆలస్యంచేసి, వాళ్ళిక రారని స్నానానికి వెళ్ళింది. హఠాత్తుగా ఇద్దరూవొచ్చారు వాళ్ళనిచూడగానే యేదో చాలా భయంవేసింది, లోపలకుపోదామని తొందరగా బిందె తీసుకుంది; కాని వాళ్ళిద్దరూ అడ్డు వొచ్చారు.

ఆత్మహత్య చేసుకుందామనుకుంది. పొంగివొస్తూవున్న యేడుపులో నిస్సత్తువై కదలలేకపోయింది వొళ్ళంతా కోసివేసికోవలె నన్నంతగా తన శరీరంమీద తనకే అసహ్యంపుట్టింది. రాత్రిపడుతూవుండగా అయ్యరు వొచ్చేప్ప టికి పడ్డుకుని లేచింది అంతా చెప్పుదామనుకుంది. కాని చెప్పలేక పోయింది ఇల్లుమార్చక తప్పదనీ, తనబాధ గ్రహించలేకపోతున్నాడనీ అనేకవిధాల యేడుస్తూ చెప్పింది అయ్యరు గ్రహించలేక పోయాడు. ఆమెకు జ్వరం

హెచ్చిపోతూవుంది. ఆలాగే చాపమీద నిద్రపోయింది అయ్యరు వంట చేసుకుని, ఆమెను లేపి తినమన్నాడు. వొద్దన్నది ఆలోచిస్తూ ఇంకో చాపమీద నిద్రపోయాడు మర్నాడు ఆవిడకు జ్వరం చాలా హెచ్చుగా తగిలింది వంట చేసుకు తిని ఆఫీసుకు వెళ్ళేముందు మందు తెచ్చి యిచ్చాడు

ఆ మధ్యాహ్నానికి నిర్ణయం చేసుకుని గోలపెడుతూ అంతా చెప్పివేసింది. వింటూవుంటే అయ్యరుకు రక్తం మండిపోయింది, మెదడు అట్లాంటిక్ మహా సముద్రంలాగ కలవరించిపోయింది. పౌరుషంవొచ్చి ఏదో చేదామనిపించినప్పుడు "అహింస అంటే, ఎంతటి హింసనైనా అమానుషంగానైనా సహించడమే" అని కొన్నివందలసంవత్సరాలనుంచి హిందూరక్తాన్ని ఆవహించిన పాడునిస్సత్తువ దిగలాగింది. వెంటనే ఆఫీసుకు సెలవుపెట్టి తిరిగి ఈయిల్లు కుదుర్చుకుని రాత్రి లోపుగా ఇక్కడకు మార్చివేశాడు ఆనాటినుంచీ పాపం ఆమె శరీరాన్ని శుష్కింప జేసుకుంటూ, వ్రతాలు చేస్తూ, దేవుళ్ళకు పెట్టుకుంటూ, నరకాన్ని మనస్సులోనూ; హాలాహలాన్ని గుండెల్లోనూ భరిస్తూ, భర్తకు కేవలం దాసిగా చేసిపెడుతూవుంది. అయ్యరుకూడా కేవలం యంత్రంలా జీవిస్తున్నాడు.

ఆమెది తప్పుకాదని తెలుసును కాని చెడినపదార్థం. ఆమె నిజమైన పవిత్రత చెడలేదని తన నిర్లక్ష్యతనూ, బాధ్యతనూ గ్రహించే విశాలత మనసులో కలిగినప్పుడు ఆ మగగుండెల్లో ఏదో వికారం కూడా తోస్తుంది మనోనేత్రం విప్పిచూసినప్పుడల్లా జవాబులేని కలకాలప్రశ్న ఒకటి కనిపిస్తుంది. కర్మభుక్కయిన ఈ హిందువుడు అర్థంరాని ఆ ప్రశ్నకేసి నిరర్థకంగా చూస్తుంటాడు . ..



## ప్రథమ కంఠే

అతను వొచ్చాడని ఎలా తెలిసిందో, అంత నిద్రలోనుంచి చప్పుమని కదిలి లేచి, కన్నులు నులిపి చూసి, 'ఆ మీరే, నిజంగా వొచ్చారా' అని ఆశ్చర్యంగా 'స్ప్రింగులా' వెంగుమని అతనివేపు గెంతి, లతలవంటి ఆ చేతులతో పెనవేసుకుంటూ, వేడి ఎక్కిపోతూవున్న ఆ గులాబీ పెదవుల్ని అప్యాయంగా అతని నోటికి అందించింది ప్రభాకరం ముద్దుపెట్టబోయి వెనక్కు తిరిగి ఆమె చేతులు విప్పుకుంటూ, 'ఉండు కోటుతీయనీ' అన్నాడు విద్యుద్దెబ్బ తగిలినట్టయింది. సరళ హృదయం మంచులా చల్లబడిపోయింది. అంత వికసించిన మొహం ఇంతయిపోయింది. తల వొంచుకుని ఒక అడుగు వెనకకువేసి నిలబడిపోయింది.

ప్రభాకరం కోటుతీసి, వరండాలోకివెళ్ళి మొహం కడుక్కునివొచ్చేప్పటికి తువాలుతీసి యిచ్చింది. పడుచుకుని మంచంమీద నడుము వాల్చాడు. సరళ "ఫోం చేయరా"అన్నది. "వెయ్యన"న్నాడు. ఆమె ఏదో సర్దుతూవున్నట్టు ఆలస్యం చేస్తూవుంటే "దా పడుకో"అన్నాడు, వెంటనే వెళ్ళి పక్కను పడుకుంది చలిచలిగా, ఉత్తరపుగాలి ఆమె ముంగురులమీదనుంచి అతని నొసటిని తాకుతూవుంది సరళ జాలిగా మీదచేయివేసి "ఎందుకు అలావున్నారూ?" అంది, "నిద్రవొస్తూవుంది"అని కన్నులు మూసివేశాడు.

ఆమె గుండెల్లో నుండినట్టయింది ఊపిరిసలపలేదు. మింగుతే లోపలకుపోని వుండ గొంతులో అడ్డుపడింది పైకిరాలేని కన్నీళ్ళు లోపల లోపలే రాలిపోతూన్నవి ఈ పదిహేనురోజుల తమ ప్రేమజీవితంలోనూ, తనజీవితం అంతలోనూ, ఇంత ఊపిరాడనిబాధ యెరగదు చూస్తే అతను అలాగే కన్నులు మూసుకుని పడుకున్నాడు. నిద్రేమో తెలియదు. నిద్రలోనూ చిరునవ్వుతోవుండే

ఆ ముఖాన్ని ఏదో వింతబాధ లోపలినుంచి పిడికిటితో అదిమిపట్టినట్లు వున్నది. అతనిరాకకు ఎదురు చూసిచూసి మెలకువ వొచ్చేవరకూ తానుపడిన యెడబాటూబాధా తోచనితనమూ, శూన్యతా, ఈబాధలో ఎగిరిపోయినవి. ఇంతబాధతోనూ అతన్ని లోపలికి అన్నట్టు తీసుకుని తలగడమీద వేదనతో తల వాల్చివేసింది.

ఆ మర్నాడుకూడా ప్రభాకరం ప్రవర్తన సరళకు బాధగానేవున్నది వొళ్ళు తెలియని ఆ పదిహేనురోజుల ప్రణయం పాలపొంగులో పులుపుపడి విరిగినట్టయింది. అనాప్యాయత అన్నట్టూ ఏదో తటస్థతా, మనసు ఎక్కడో వున్నట్టూవుండడం తప్ప తనయెడల ఆతను చూపిన నిరాదరణ మరేమీలేదు.

ఏమిటీ విరుపు. అనేప్రశ్న ఆ హృదయంలో స్థిరంగా పడిపోయింది.

ఈ పదిహేనురోజులూ ఒక అమృతక్షణంలాగా గడిచిపోయినై. కాలం నడుస్తూవున్నట్టుగాని, అవతల ప్రపంచం వున్నట్టుగాని వాళ్ళ గణింపులోనుంచి తొలిగిపోయినవి

శిస్తు వసూళ్ళకోసం వెళ్ళిరమ్మని అమ్మ జ్ఞాపకం చెయ్యగానే గుండెల్లో ఏదో దిగులుగాతోచింది. ఉదయాన్నే లేచివెళ్ళి సాధ్యమైనంత త్వరలో రావలె ననుకున్నాడు ఈసంగతి చెప్పగానే సరళ చూసినచూపు. ఎంతో మరపురానితనంతోనూ, ఎంతో తియ్యని వేదనతోనూ హృదయంలో నాటిపోయింది ప్రొద్దున్నే ఆ చేతులతో యిచ్చిన కాఫీ తాగి, ఒప్పుకోని కాళ్ళను బలవంతంగా నడిపించుకుని వెళ్ళిపోయాడు వీధికడంటా తనను చూస్తూ నిలబడిపోయిన సరళవిగ్రహం మనసులో అలాగే వుండిపోయింది.

రాత్రిపడేలోపుగా ఇంటికి చేరుకోవలెనని ఎంతో యత్నించాడు కాని రత్తయ్యకాపు వ్యవహారాలు తెమిల్చాడుకాడు. "బాబుగారు ఎప్పుడూలేదు. చిరాకు పడుతున్నా"రంటే ప్రభాకరానికి మరీ కష్టంతోచింది.

సంజజారి ఆఖరి యెరుపుకాంతులు చీకట్ల చేతులలోకి వాలుతూవుంటే అతని హృదయం తల్లడిల్లిపోవడం ప్రారంభించింది

ఇల్లుచేరేప్పటికి పదిగంటలు దాటిపోతుందన్న సంగతి దుర్భరంగా తోచింది. దూరాన్ని శ్రమనీ అనేక ఊహలతో తగ్గించుకున్నాడు. ఆ రోజంతా సరళ ఎంత

కూన్యత ఎంత ఏకాకిత అనుభవించిందో, భోజనం సహించిందో లేదో, తల - ఆ ఉంగరాలజుట్టు దువ్వుకుందోలేదో, సాయంత్రంపడుతూవుంటే ఎంత దిగులుతో తనకోసం ఎదురుచూసిందో; చీకటి పడిపోయినకొద్దీ నిరాశపడిపోయి ఎంతబాధ పడిందో,

బహుశా భోజనం చెయ్యకుండా, అమ్మ భోంచెయ్యమన్నా ఆకలిలేదని తన కోసం మానివేసివుంటుంది. నిద్రైనా రాక, ఏచప్పుడైనా తానే అని ఉలికిపడి చూస్తూవుంటుంది,

తాను చెయ్యవలెనని ఆలస్యం చెయ్యడని తెలుసును కాని వ్యవహారాలు తెమలలేదు— పాడు వ్యవహారాలు అని నిందిస్తూవుంటుంది తన దోషం ఏమీ లేదుకదా. ఎంతఆలశ్యమైనా ఇంత శ్రమకూ ఓర్చి అర్ధరాత్రి అయినా ఇల్లు చేరు కుంటున్నాడు కదా'...

పది దాటిపోయింది ఇంకోఅరగంట బహుశా తలుపువేసి అమ్మ నిద్రపో తుంది సరళ తనకోసం ఎదురు చూస్తూవుంటుంది, నవల చదువుదామంటే కథ నడవక మంచంమీద పడి దొర్లుతుంది. బయట చప్పుడైనట్టుంటే వొచ్చారని ఉలికి పడి లేస్తుంది. తన చర్యలు చూసుకొని తానే నవ్వుకుంటుంది. సరళ ఏమేమి అనుకుంటూవుందో....

తన జోడుచప్పుడు వినబడగానే గభీమని తలుపుతీసి ఎదురు వొస్తుంది, తానేంచేయడం? గట్టిగా కౌగిలించుకుని గాఢంగా ముద్దు పెట్టుకోవడం, కాదు .... అలుగుకుందేమో, చెయ్యవలెనని, తనను ఏడిపించడానికి, ఇలా ఆలస్యం చేశానని నిందిస్తుందేమో. . ఆ అలక తీర్చడం ఎట్లా? తానెంత ఆత్రుతతో వొచ్చిందీ చెప్పితే నమ్ముతుందా? . 'ఈ చీకటీ, ఈ బరువై కదలని కాలమూ, నా గుండెల మీద ఇనపబరువుగా వుంటే, ఒంటరిగా నీకోసం బాధపడిపోయా' నని ఏడుస్తుం దేమో ఆపుకోలేక, ఎట్లా ఓదార్చడం?

ఎన్నో వింత వింత విధాలు ఆలోచించుకుంటూ మలుపు తిరిగి వీధిలోకి వొచ్చాడు. ఇల్లు కనపడింది, గుండెలు కొట్టుకున్నాని. వీధంతా అతి నిశ్శబ్దంగా వుంది తన జోడు చప్పుడు హృదయంలో ప్రతిధ్వనిస్తూంది, ఇంటి గుమ్మం

దగ్గరకు వొచ్చాడు. ఒక నిమిషం ఆగాడు తలుపు చప్పుడైనా కాలేదు. తలుపు దగ్గరకు వెళ్ళాడు. లోపల ఏ చప్పుదూలేదు అట్లా నిలబడి పోయాడు. నిశ్శబ్దంగా మళ్ళీ విన్నాడు తన గుండెల చప్పుడే తప్ప ఇల్లు అతి నిశ్శబ్దంగావుంది దిగాలు మంది మనస్సు. కాదు. తనది పొరబాటు. దొంగ! తలుపు దగ్గర దాక్కుని ఏది వింపడానికి ఆలోచిస్తూవుంది తగిన తమషాచేస్తాను అని, చప్పుడుకాకుండా జోడు తీసివేసి, రెండో దారిని వెళ్ళి 'అమ్మా' అని నెమ్మదిగా పిలిచాడు మొదటి పిలుపుకే 'ఆఁ నాయనా, వొచ్చావా' అని లేచి తలుపుతీసింది గదివేపు చూస్తే సరళ మంచంమీద నిద్ర పోతూవుంది దగ్గిరగావెళ్ళి చూశాడు మంచినిద్రలోవుంది

చిన్నప్పు దేమోతప్ప ఇంతకాలం వ్యక్తపరచకుండా ప్రేమిస్తూన్న అమ్మ గుండెలేనా తాను పిలిచేప్పటికి పలికేవి, తన అడుగులచప్పుడయ్యేప్పటికి అంత నిద్రలోనుంచీ ఉలికిపడి లేచేవి?

అతనిగుండెలు ఆగిపోయినవి. మెదడు ఖాళీ అయిపోయింది. ఒక్కనిమిషం ఏమీతోచలేదు. ఎంత నిరాశ! ఎంత భంగపాటు! ఆ హృదయంలో తానున్నాడా? ఉంటే అంత హాయిగా నిద్రపోగలుగుతుందా? దగ్గిర ఉన్నప్పుడేనా ఉబలాటా, ఆత్రుతా, ఆ ఆప్యాయతా అంతా? ఆమె స్థితిలో తానుంటే అలా నిద్ర పొయ్యేవాడేనా? సరళకు సరియైన హృదయం లేదా? ఎలా నిద్ర పోగలిగింది? దూరమయిన ప్రియుడికోసం ఎదురుచూస్తూ కొట్టుకునే గుండెలు అంత హాయిగా శాంతిగా అయిపోనిస్తవా ఏ ప్రియురాలివైనా? సరళను గురించి ఎన్ని ఎన్ని అద్భుతమైన భావాలతో, ఆమె ఎంత అద్భుతమైన ప్రియురాలు, ఉత్తమనాయిక అని పద్యాలు రాశాడు! తన కవిత్వానికి అపూర్వమైన ఘనత వొచ్చిందే, ఈమెను సృష్టింపుకోవడంలో! ఇవన్నీ తాను ఊరికే భ్రమించిన భ్రమలేనా? ఇంతవరకూ ఊహించుకున్నదంతా కేవల స్వాప్నికంగా యెంచుకో వలసిందేనా?

ఇదంతా తప్పేమో?

ఎంత సమాధానపరచుకున్నా, స్వచ్ఛకాంతితో వున్న ఆ ప్రణయంమీద ఒక సంశయచ్ఛాయ పడింది అల్పమైనా, మొదటిది కనుక, నిద్రలోనూ చిరునవ్వు నవ్వే ఆ ముఖాన్ని ఏదో వింతబాధ లోపలినుంచి పిడికిటితో అదిమిపట్టింది

# కాలం కల్పించే మార్పు

అస్తమించిపోతూవున్న రోజు యాతనపడుతూ ఉన్నది. ఇకను ప్రపంచానికి చీకటే అని భయపడి పోతూవున్నట్టు పక్షులూ, జంతువులూ కంగారుగా అరుస్తూ వున్నవి అస్తమింపు తాత్కాలికం, మళ్ళీ స్వచ్ఛకాంతులతో ఉదయం కలుగుతుంది అనే జ్ఞానమున్నట్టు మానవుడుమాత్రం నిర్విచారంగా నడిచిపోతున్నాడు.

ఈ చింతఆలోచనలలో అర్థంకాని అనేక ప్రశ్నలు స్ఫురిస్తూ ఆకాశంకేసి చూస్తున్నాను. ఇంతలో మెట్లకిందనుంచి 'కా-ఆ-ఆ-మ-అ-య్యా ఆ-ఆ' అనే వొణుకుగొంతుక వినవొచ్చింది లేచి చూడడానికి పోబోతూవుంటే ఒక ముసలి పండు, కర్ర ఊతగా కాళ్ళునెట్టుకుంటూ, తొందరగా నాపక్కనుంచి తిన్నగా పడమటిగదిలోకి వెళ్ళిపోయింది. నేను ఆశ్చర్యపడుతూ ఒక అడుగు లోపలకు వేసేప్పటికి, ఏదో కిందపెట్టినట్టు రక్కుమని చప్పుడైంది "కామయ్యా, ఇదిగో నీది నీవు తీసుకో, నీది నీకు అప్పగించేశా నబ్బా, ఇంక నా కెందుకూ, మరి నేను పోతున్నా. నే పోతాను కామయ్యా, పోతున్నా!" అంటూ గదిలోనుంచి వొచ్చి, గబగబా మెట్లు దిగి, వెళ్ళిపోతూవుంది ఆమె కంటికి నేను కనుపించినట్టే లేదు. ఆ చూపు ఎక్కడనో మరి!

గదిలోకి వెళ్ళి చూస్తే ఒక దంతపునగిషీపెట్టె మంచం దగ్గరగా నేలమీదను ఉన్నది. ఎత్తుతే చాలాబరువుగా వుంది దానినే పట్టుతాడుకు కట్టిన బంగారు తాళం వేలాడుతూ వుంది తెరిచి చూస్తే లోపల వజ్రం ఉంగరాలూ, కమ్మలూ, జవ్హారీ ఉన్నవి. ఇంతలో, వీధిలో ధప్పుమని పడినట్టు చప్పుడైంది. వసారాలోకి పరుగెత్తి తొంగిచూస్తే వీధిలో మెట్లకింద ఆ ముసలి వెల్లికిలాపడి గుడ్లు తేలవేస్తూ

వుంది. పరుగెత్తుకుని వెళ్ళి భుజాలు పట్టుకుని లేవదీయబోయాను. 'కామయ్యా, కామయ్యా' అంటూ ప్రాణాలు వొదిలేస్తూవుంది ఎదరింటిలో ఉన్న వెంకట శాస్త్రులుగారు అరుగుమీదకు వొచ్చి 'అశి రండా, ఇక్కడికే వొచ్చి చచ్చింది!' అంటూ, 'అయ్యో వదలండి వదలండి! ఛీ! ఛండాలం మనిషి' అన్నాడు ఆమె ప్రాణాలు పోయినై వీధిలో పదిమందీ, దారిబోయే ప్రజా, శవం చుట్టూ గుమి గూడారు. అందరూ నోటికి ఒకమాటగా అన్నమాటలనుబట్టి నాకు తెలిసినకధ ఇది:

కామయ్య అనే కంసాలి ఒకాయన ఈ వీధిలో కాపురం వుండేవాడు: ఆయన నగిషీపనిలో చాలా చేతకారి. ముందు నగలషాపు పెట్టి తరవాత బంగారం నవరత్నాలూ మొదలైనవి వర్తకాలు చేసి అయిదారు లక్షల రూపాయిల ఆస్తి సంపాదించాడు. ఈ వీధిలో మేడలన్నీ ఆయన కట్టించినవే రెండు ఇళ్ళు తప్ప ఈ వీధి అంతా కొనేశాడు ఆయన చేసిన ధర్మాలకు మెచ్చి మునిసిపాలిటి ఈ వీధికి ఆయనపేరే పెట్టారు. ఉన్నన్నాళ్లూ మహావైభవం అనుభవించాడు రెండుగుర్రాల బండీ, ఎందరో నౌకర్లు, మహారీవిగా వుండేవాడు ఈ చనిపోయిన ముసలి భోగం స్త్రీ కామయ్య ఈవిణ్ణి చిన్నప్పుడే చేరదీశాడు, ఈమె ఆయన భార్యవలెనే జీవించింది ఆయనతోపాటు జీవితం గొప్పగా అనుభవించింది. రవ్వల జహ్వారీ, గుర్రంబండీ, పెద్దమేడా - చాలా దర్జాగా వెళ్ళింది ఆమె జీవితం. ఆరోజులలో అంత అందమైన స్త్రీ మరెవ్వరూ లేరనుకొనేవారట పదేళ్ళ క్రితం కామయ్య చని పోయాడు. మీనాక్షి ఆనాటినుంచీ నగలన్నీ తీసివేసి వితంతువలె వుండేదట మొన్నటివరకూ తీర్థయాత్రలలోనే జీవితం గడిపివేసింది. ఊరిలోకి ఎప్పుడు వచ్చిందోకూడా తెలియదు.

ఈవిధంగా ఆమెను కీర్తించనివారు లేరు ఒక్క వెంకటశాస్త్రులే మధ్య మధ్య చెడ్డగా అంటూవొచ్చాడు విన్నదాన్నిబట్టి ఆమెమీద నాకు చాలా గౌరవం కలిగింది, ఆమె జహ్వారీ సంగతి తొందరపడి బయటపెట్టకూడదని నిశ్చయించు కున్నాను మేడమీదకు వెళ్ళి దంతంపెట్టిని జాగ్రత్తగా నా పెట్టిలో దాచివేసి, కిందకువొచ్చి కూచున్నాను.వొచ్చేజనమూ పోయేజనమూ ఎన్నికబుర్లుచెప్పినా ఆమె దహనంసంగతి ఎవ్వరూ ఎత్తడంలేదు. వెంకటశాస్త్రుల్ని పక్కకు పిల్చి ఈ

సంగతి అడిగితే, వికృతంగా నవ్వుతూ "ఎబ్బే . మనకెందుకుబాబూ, ఆ మున్సి పాల్‌కి కబురుచేస్తే పాకీవాళ్ళని పంపిస్తారు ఆ వెధవలు కాలికి తాడుగట్టి లాగే స్తారు, నీతీజాతీలేని . "—ఒండగా మాట్లాడడం ప్రారంభించాడు నాకు చాలా కష్టంగా తోచింది ఇతని ప్రవర్తన తిన్నగా 'హాస్టల్‌కు వెళ్ళి సంస్కరణాభి లాషులమంటూ 'డిబేటింగ్ సొసైటీ'లో ఉపన్యాసాలిచ్చే మా క్లాసువాళ్ళని హెచ్చ రించాను చాలా ఉత్సాహంగా హాస్టలంతా, చందాలుపోగుజేసి ఇరవై రూపాయిలు సమకూర్చి, నా వెంట ఒయిలుదేరారు కాని, ఎంతడబ్బు ఇస్తామన్నా మోతకు ఎవ్వరూ రామన్నారు భోగంవీధికి వెళ్లి అక్కడివాళ్ళని అడిగితే 'కంసాలిని వుం చుకుని కులం చెడినదాన్ని ఎవరు మోస్తారు?' అన్నారు. అప్పటికి తొమ్మిదిగంట లైంది మాతోవున్న నాయుడుగారి అబ్బాయి, "ఆలోచించడం ఎందుకు? మనమే మోసుకుపోదాం, తప్పేముంది'' అన్నాడు అందరమూ అంగీకరించాము. నలు గురు ఏనాదులు డబ్బిస్తే సహాయానికి మాత్రం వొస్తామన్నారు వీధంతా తెల్లబోయి విచిత్రంగా చూస్తున్నారు వెంకటశాస్త్రి నోరువిడిచి ఒకమోస్తరుగా మాటలు రావి స్తున్నాడు; పైగా, పోలీసుబెదిరింపుకూడా ఒకటి పెట్టాడు నాయుడు సర్కిల్ ఇన్స్పెక్టరు బంధువు వెళ్లి ఆయన్ని తీసుకువొచ్చాడు ఆయన దగ్గరవుండి పంచా యితీచేసి 'మీయిష్టం, తీసుకువెళ్ళవచ్చు'' నన్నాడు ఆపరిస్థితుల్లో ఆశవాన్ని మోసుకువెళ్ళడం ఒక వీరకార్యంలా అనిపించింది మా అందరికీ

ఆనాడు కాలేజీఅంతా మమ్మల్నిగురించే చెప్పుకున్నారు, నాచర్య అంద రికీ వింతగా వున్నది. వారంక్రిందట సంఘసంస్కరణాన్ని గురించి ప్రొఫెసర్ వెంకయ్యగారు ఉపన్యసిస్తే, సనాతనధర్మాలను పాడుచేయ రాదని నేను ఆయ నకు వ్యతిరేకంగా తీవ్రంగా మాట్లాడుతూ, వెంకయ్యగారు చెప్పిన సాంఘిక సమ స్యలు ఆయన కల్పించుకున్నవే అనీ, హిందూసంఘం ప్రపంచములోని సంఘాల కన్నా ఉత్తమస్థితిలో ఉన్నదనీ; ఆర్యమతాన్ని గురించీ, వర్ణాశ్రమధర్మాలను గురించీ వాళ్లు తెలియకుండా మాట్లాడాను, నన్ను చూడగానే వెంకయ్యగారు చేయి పట్టుకుని అభినందిస్తూ, "నీవు నిన్నచేసిన పని విన్నాను. నాకు చాలాసంతోషంగా

ఉన్నది, మన సంఘంలోని లోపాలను క్రమేణా గ్రహించిన కొద్దీ మాదృష్టి నీకు అర్థమౌతుంది" అన్నారు.

నిద్రమత్తుగా ఉండడంవల్ల మధ్యాహ్నానికి సెలవు పుచ్చుకుని ఇంటికివొచ్చి పడుకున్నాను సాయంత్రం ఆరు గంటలకు మెలకువవొచ్చింది టీ తాగుదామని కిందకు దిగి తలుపుతాళం వేస్తూవుంటే రెండురాళ్ళు నావెనకనుంచి తలుపునకు తగిలినవి చప్పుమని తిరిగిచూస్తే ఇద్దరు కుర్రవాళ్లు ఎదరసందులోనుంచి తొంగిచూస్తున్నారు ఉపేక్షించడం కార్యంకాదని తరమపోయాను. కాని సందుమలుపుకో వెంకటశాస్త్రి దొడ్డిగుమ్మంవద్ద వాళ్ళు మాయమైపోయారు నేను తిరిగి వొస్తూంటే మూడవయింటిలోవున్న అవధాన్లు "అయ్యా మాట" అని, అరుగుమీద కూర్చోబెట్టి నాకు కొన్ని సంగతులు చెప్పారు. దాని సారాంశం ఇది

నేను చేసినపని ఈ వీధిలో బ్రాహ్మలకేకాకుండా అందరికీకూడా కంటకంగా వున్నది. భోగంవాళ్ళే ముట్టుకోడానికి అసహ్యించుకునే పాడు శవాన్ని నేను మోయడమే కాకుండా, శ్రోత్రియ కుటుంబాలలోని కుర్రవాళ్ళచేత కూడా మోయించాను. వాళ్ళని పాడుచేసింది నేనే అని అందరి అభిప్రాయమూ అందరికీ నా చర్య కష్టంగా వున్నది దానికితోడు వెంకటశాస్త్రి ఒక వింతప్రచారం ప్రారంభించాడు. ఏమనంటే రాజమహేంద్రవరంలో వీరేశలింగం అని వొక పంతులూ, ఎవరో ఇంకొక గిరజాల బందరు నాయుడూ ఉన్నారట ఈపంతులూ నాయుడూ కలిసి అనేక అభాజనపు పనులు చేస్తున్నారట. మొగుడుపోయిన వితంతుపిల్లల్ని ఎత్తుకువొచ్చి వాళ్లద్వారా కుర్రవాళ్ళని ఆకర్షించి, వివాహాలు చేయిస్తున్నారట చెడిపోయిన ఆడవాళ్ళనీ కులటల్నీ మంచిమార్గానికి తిప్పుతున్నామని, ఏమీ యెరగని కుర్రాళ్ళకి కట్టుబెడుతున్నారట. వర్ణభేదం అన్యాయమని బ్రాహ్మణకుర్రాళ్ళచేత నానా మాలకూడూ తినిపిస్తున్నారట. ఈ విధంగా వీళ్లిద్దరూ పవిత్రమైన హిందూసంఘాన్ని పాడుజేస్తున్నారట.

ఆ నాయుడు చిన్నప్పుడు మిలిటరీఅట బాగా తాగుతాడట పంతులు నాయుడుతో లోపాయికారీని మాంసం తింటాడట, కాని, తాగుతాడో లేదో మాత్రం తెలియ

చట. పెళ్ళి సమ్మి వొచ్చిన అమాయకపు ఆడపిల్లలగతి, అసలు చెడిపోయి విశ్వాసఘాతకులైన కుటుంబ పరువు తీయటానికి చెప్పినట్టింతెటట 'మిమ్మల్ని అనుస రిస్తాము, ఎక్కడతయినా మొగుడుపోయిన పిల్లలు వ్యక్తురాళ్ళయినవాళ్ళుంటే వాళ్ళని వెనకేసుకు వొస్తాము' అని శపథంచేసే కుర్రవాళ్ళుంటే వాళ్ళకు పంతులు నెలకు మూడ్నాలుగురూపాయిలవొప్పున ఇస్తాడట నేను ఈ విధంగా వాళ్ళదబ్బుతింటూ వాళ్ళకి సహాయం చేయటానికి చెడిపోయినవాళ్ళలో ఒకడినట, ఒక భోగందాని శవాన్ని ఇలా మోసుకువెళ్తే నలుగురూ ఎలా అనుకుంటారో చూదామని, నేను వేసిన ఎత్తుల విన్నటివని కొందరైనా మెచ్చుకుంటే అది అదనుగా తక్కిన కార్యా లకు ఉపక్రమిస్తానట. నన్ను ఈ వీధిలో ఉండనిస్తే ఆడవాళ్ళకి మానం దక్కదట ఇప్పటికే ఇళ్ళల్లోని చాలా వితంతువులకు ఉత్తరాలు నడుపుతూవున్నానట ఇక నేడో రేపో ఒకరొకర్ని రాజమహేంద్రవరం తరిలిస్తానట

ఈ విధంగా వెంకటశాస్త్రి రహస్యంగా ఆడవాళ్ళతోనూ, మగవాళ్ళతోనూ చెప్పి, సాధ్యమైనంత త్వరలో నన్ను వెళ్ళగొట్టించి తమకు రాసున్న ప్రమాదాలను తొలిగిస్తాను అంటున్నాడట తనకు పద్దెనిమిదేళ్ళ వితంతువు కూతురు ఉండడం వల్లను భయపడి ఇంతకు పూనుకోవలసి వొచ్చింది అని, ఒక ప్రచారం ప్రారంభిం చాడట ఇది కొందరు పూర్తిగా నమ్ముతున్నారట వెంకటశాస్త్రిమాట కేవలం నమ్మకంకాదు కాని, నేను నిన్న చేసినపని ఆ నమ్మకానికి అవకాశం కల్పిస్తూ వున్న దిట ఇదంతా సొంతంగాచెప్పి "అయ్యా ఎటునుంచి యెటువొస్తుందో, ఎందుకు వొచ్చింది, మీరు ఇంకెక్కడైనా బస చూసుకుని, ఇక్కడినుంచి తప్పుకుంటే మం చిది, తరువాత మీఇష్టం, గోలపడడం ఎందుకని మీకు చెప్పుతున్నాను" అని నన్ను పంపించి వేశారు అవధానులుగారు

నాకు మహావింతగా వున్నది ఈ చరిత్ర వీరేశలింగంపంతులుగారిని గురించి గాని, వెంకటరత్నంనాయుడుగారిని గురించిగాని నాకు విస్తారం తెలియదు. ఏమిటా ఇదంతా అనుకుంటూ గుమ్మంలోకి వొచ్చి, తలుపు తాళం తీయబోతూవుంటే వెంకటశాస్త్రి, అరుగుమీదకువొచ్చి సకిలించి, "ఒకమాటు ఇలా దయచెయ్యండి!"

అన్నాడు సరే చూతామని వెళ్లాను. చావడిలో కుర్చీమీద కూచోమని, నామేలు కోసమే తాపత్రయపడుతూవున్నట్టు, ఈ ఉపన్యాసం ఇచ్చారు

"మీరు నన్ను అపార్థంచేసుకోవొద్దు ఎంతఅభిప్రాయభేదాలున్నా, మనం వొకేశాఖవళ్ళమనీ, దూరంగానయినా మీరు బంధువులనీ,మనలో కొంచం పైకివొచ్చేటట్టు గొప్పచదువులు చదవబోతున్నారనీ, లోపల అభిమానమూ గర్వమూ ఏదుస్తుంది నాకు. ఇంతకీ మీరేం స్వార్థాన్ని యెంచుతున్నారు గనకనా: సంఘం సరియైనస్థితిలో లేదనీ, ఎలాగైనా మీరనుకున్నదారికి పట్టించుతే బాగుపడుతుందనీ మీ అభిప్రాయం ఈ విషయాలు నేనూ ఆలోచిస్తూవున్నవాణ్ణే గనక గ్రహించగలను మొట్టమొదట ఆ వీరేశలింగంతో వాలా ఉత్తరప్రత్యుత్తరాలు జరిపాను. నేనూ పత్రికలకు రాసేవాణ్ణి ఆయన అభిప్రాయాలు నాకు తెలిసినంతబాగా యితరులకు తెరియవేమో కూడా ఒకవిధంగా మహాధీరుడూ, మహానుభావుడూకూడా. లోపల ఈవిషయమయి ఆయనంటే నాకు గౌరవం లే-పోలెదు నా మతం ఏమిటంటే, సంఘాన్ని అలా రెచ్చగొట్టడంకన్న, మార్పు నెమ్మది నెమ్మదిగా రప్పించడం ఎక్కువ తెలివైనపని అని సంఘం మహామూర్ఖం చూడండి: వొత్తిగా బెదరగొడితే లొంగదు

"ఇంతకూ మీకు చెప్పవొచ్చేది యేమిటంటే మీరు నిన్న చేసిన పని పెద్ద తప్పేమీకాదు కాని, మరి ఎంతైనా బ్రాహ్మణసంఘం, అందులోనూ మన వైదీకి శాఖ, అంగీకరించలేదు, ఇక్కడివాళ్ళు మహాఛాందసులు మీమీద వాళ్ళకి మహాకిష్టంగా వున్నది నేను కొంత చెప్పి చూశాను కాని, ప్రయోజనం లేదు. మిమ్మల్ని ఈ వీధిలో ఉండనివ్వడం వాళ్ళ అభిప్రాయం కాదు సంఘానికి ఎదురుతిరిగి నిర్వహించడం ఎంతకష్టం' పాపం ఆ వీరేశలింగంపంతులు చూడండి ఎన్ని అవస్థలు పడుతున్నాడో:

"మీరు మరొకవిధంగా తలుచుకోమంటే చెబుతాను. ఈవిధంగా మీరు వుంటే ఎలాగైనా ఈ వీధిలోనుంచి మిమ్మల్ని పంపించివేయాలనే ప్రయత్నాలు తీవ్రంగా జరుగుతవి, నేనైనా ఆపలేను కాని, నాది ఒక చిన్న సలహా వున్నది.

మీకు అంగీకారం కాకపోయినా క్షమించాలి, ఏదో బంధువులమనే అభిమానం ఆపుకోలేక అంటున్నాను చూడండి, సంఘసంస్కారమైనా అడుగుతీసి అడుగు వేయాలికాని, తొందరపడి పరిగెడితే కాదు ఇదివరలో మీతో చెప్పాను, మా అన్నకూతురు సంగతి ఇతర సంబంధాలు వొస్తూన్నవని వాళ్ళు తొందరపడు తూవున్నారు, ఆగమని నేను ఆపుజేయిస్తున్నాను. మీరు ఈ సమయంలో సరే అని రేపు తాంబూలాలు అంగీకరించారా నా సంగతి మాడండి: నాకు ఆమాత్రం అవ కాశం ఇచ్చారా అది ఆధారంగా తీసుకుని వీధినంతా తిరగదోస్తాను మీరు గృహస్థ ధర్మం వొప్పుకుంటున్నారు, మన శ్రోత్రియసంబంధం అంగీకరించారు అంటే నొక్కుకుపోతవి ఈనోరులన్నీ. ఏదో పెద్దవాణ్ణి, కావలసినవాణ్ణీ కనుక వినండి ఇదీ కాక, మీరు ఒంటిగాకన్నా గృహస్థు అయితే నిర్వహించగలుగుతారు ఏ సంస్కారాన్నయినా నా మాట నమ్మండి ఇప్పుడే వొస్తాను, కొంచం కూ చోండి" అని లోపలకు వెళ్ళాడు.

నేను మాట్లాడితేకాదు, ఇతని వింతపోకడలు కనిపెడదామనుకుంటున్నాను, ఇంతలో పక్కతలుపు జంకుతూ తీసుకుని శాస్త్రులు వితంతువుకూతురు బెదురుతూ నాదగ్గరకువొచ్చి బొడ్డులోనుంచి ఒక వుత్తరంతీసి, ఖంగారుగా నాజేబిలో దోపి "మీ రేమీ అనుకోకండి, ఈవుత్తరం చదివితే అంతా తెలుస్తుంది, మానాన్నకు మాత్రం తెలియనీకండి, జాగ్రత్త నాన్న వలలో పడిపోకండి ఇంక వొస్తాడు, ఏ మైనా ఇది రహస్యం. కాపాడండి. మీరే రక్షించాలి నన్ను" అని నాచేతులు రెండూ గాభరాపడుతూ నొక్కి, ఆ గదిలోకి వెళ్ళిపోయి తలుపులు వేసుకుంది. ఇంకో నిమిషానికి ఒక ఫోటో తీసుకుని శాస్త్రి వొచ్చాడు. అది నాచేతిలో పెట్టి ఆ అమ్మా యిని వర్ణిస్తూ, కట్నం ఇంకో వందో రెండువందలో హెచ్చుచేయిస్తాను అని సోది ప్రారంభించాడు. ఈపరిస్థితులలో నేను తొందరపడడం మంచిది కాదని ఎటూచెప్పకుండా తప్పించుకుని వొచ్చాను

తలుపులు జాగ్రత్తగా వేసుకుని. దీపం వెలిగించి, వుత్తరం తీసి చదువు కున్నాను. దానిలో ముఖ్యమయిన విశేషాలు ఇవి "మానాన్న దుర్మార్గుడు,

దొంగ, మహాస్వార్థపరుడు పరాయివాళ్లూ తనవాళ్ళూ అనే భేదంకూడా లేదు, కూతురు అనే ఆలోచనఅయినా లేదు తన స్వార్థం ప్రధానమయినప్పుడు.

"నా ఎనిమిదోయేట నాలుగువేలరూపాయలకు ఆసపడి నన్ను అరవైరెండేళ్ళ ముసలివాడికిచ్చి పెళ్ళిచేశాడు ఇంతకన్నా అన్యాయం, నాలుగేళ్ళ క్రితం రెండువేలరూపాయీలు ఇస్తే నన్ను ఇచ్చివేస్తాను. మళ్ళీ పెళ్ళో ఏదో మీయిష్టం వొచ్చినట్లు చేసుకోవచ్చును అని వీరేశలింగంపంతులుగారికి రాశాడు ఆయన చివాట్లు వేస్తూ జవాబు రాసినవుత్తరం నేను చూడడం తటస్థించింది అప్పటివరకూ ఆ వీరేశలిగంగారు ఎవరో ఆడపిల్లల్ని డబ్బిచ్చి కొనుక్కునేవారు, మా నాన్నకన్నా కసాయి అనుకుంటూవొచ్చాను కాని, మా నాన్నను తిడుతూ ఆయనరాసిన జవాబు నుబట్టి గ్రహించాను, మహానుభావుడు మాలాంటి దిక్కులేనివారి యాతనలను తప్పించడానికి అవతరించాడు మీరు వారి అనుచరులే అని మా నాన్న విన్నను మా పొరుగింటి శేషమ్మతో అంటే విన్నాను మీరందరూ ఎంత మహానుభావులు.. నన్ను ఎలాగైనా దయవుంచి పంతులుగారిదగ్గరకు చేర్చండి మీకు పుణ్యముంటుంది

"మా పెదనాన్న చచ్చిపోగానే, దిక్కులేని ఆయన భార్యను దగాచేసి ఆ ఆస్తి కాజేశాడు, అతని కూతురిపెళ్ళి తననెత్తిమీద పడిపోయింది. మీకు ఎలాగైనా అంటగడదామని ఎత్తు యెత్తాడు. కాని మీరు పడలేదు అనాటినుంచీ మీమీద చాలా కోపంగా వున్నది ఏమీ చేయలేక ఇన్నాళ్ళూ వూరుకున్నాడు ఇప్పుడు అదను దొరికింది

"మా నాన్న కామయ్యదగ్గర గుమస్తాగా ఉండేవాడు కామయ్య ఎన్నో విధాల ఉపకారాలుచేశాడు. ఈ యిల్లు కట్టించి ఇచ్చాడు అతనికి తెలియకుండా మా నాన్న అతని వ్యవహారాలలో చాలాడబ్బు దొంగిలించాడు. అప్పటికీ 'కక్కుర్తి బ్రాహ్మడు' అని వూరుకున్నాడు కామయ్య కాని, మా నాన్న అంతతో ఆగలేదు. నెమ్మదిగా మీనాక్షిని స్వాధీనం చేసుకుంటే ఆవిడడబ్బుకూడా కొంత కాజేయవొచ్చునని ఆమెను లొంగదీసుకోపోయాడు. మీనాక్షి చాలా అభిమానంగల మనిషి.

పతివ్రత, కోపిష్ఠికూడా. కామయ్యే యెవరను ఒకనాడు మా నాన్నను చెప్పుతీసుకుని
కొట్టి గెంటించివేసింది అప్పటినుంచీ మీనాక్షిని సాధించవలెనని అనేక ప్రయ
త్నాలు చేశాడు కాని, మంచి పలుకుబడి వున్నమనిషి, ధనవంతురాలు. సాగింది
కామ వచ్చినతరవాతను అయినా సాధించి సంతోషించుదా మనుకుంటే మీరు
అడ్డువొచ్చారు దాని అదృష్టం, మీలాంటి బ్రాహ్మల చేతులమీదుగా వెళ్ళిపోయింది.
ఈ కారణాలచేత మా నాన్నకు మీమీద మహా కక్షగా వున్నది నీచుడు ఏం చేయిం
చినా చేయిస్తాడు నిన్నటినుంచీ ఛండాలపుపనులన్నీ చేయిస్తున్నాడు మిమ్మల్ని
గురించి ఇరుగుపొరుగువాళ్ళందరితోనూ అసహ్యంగా చెబుతున్నాడు ఏదైనా,
నాకు మాత్రం ఉపకారమైంది ఇందువల్ల ఆ మహానుభావులు వీరేశలింగంపంతులు
గారినిగురించీ, మిమ్మల్నిగురించీ నాకు బాగా తెలిసింది. వితంతువు కావడం
నా తప్పుకాదని ఇదివరకే తెలుసుకున్నప్పటికీ, నా గతి ఇంతే అనుకునేదాన్ని.
నాలాంటివాళ్ళు మళ్లీ పెళ్ళిచేసుకోడం తప్పయివుండదు, అయితే వీరేశలింగంపం
తులుగారూ మీలాంటివాళ్లూ పూనుకోరు అని అనిపిస్తూవుంది మీరు నన్ను
రక్షించాలి . "

ఈ ఉత్తరం చూడగానే నాకు ఏమీ తోచలేదు విధవావివాహాలు అవసరం
కాదని బహిరంగంగా ప్రొఫెసరు వెంకయ్యగారి ఉపన్యాసాన్ని ఖండిస్తూ యిదివరలో
వాదించాను ఈఉత్తరం చదువుతూవుంటే, వెంకటశాస్త్రిలుచరిత్ర తలుచుకుంటూ
వుంటే, నామనస్సు మారిపోతూన్నది. తిన్నగా వెంకయ్యగారియింటికి వెళ్ళి, జరిగిన
దంతా చెప్పి ఈ అమ్మాయి ఉత్తరం ఇచ్చాను బాగా ఆలోచించి, "మనం పంతు
లుగారి సలహా పుచ్చుకోడం చాలా అవసరం, నీవు వెంటనే బయలుదేరి పంతులు
గారిదగ్గిరికి మీనాక్షినగలూ ఈఉత్తరం పట్టుకుని వెళ్ళడం ఉత్తమం ఆయన
ఎట్లా చెప్పుతే అట్లా మనం చేతాం ఆయన్ని నీవు ఈపరిస్థితులలో స్వయంగా
కలుసుకోడంకూడా మంచిది నన్ను ఆయన ఎరగరు నేను నాయుడుగారి శిష్యుణ్ణి,
వారికాలేజీలోనే చదువుకున్నాను. నాయుడుగారూ నన్ను బాగా యెరగరు. కాని
వారు ఏంచేయమన్నా చేస్తానని చెప్పు." అని సలహా ఇచ్చారు

నేను రైలు దిగి తిన్నగా పంతులుగారి తోటలోకే వెళ్లాను. చెట్టుకింద కుర్చీ

మీద కూర్చుని, ఎదర కుర్చీలో కూర్చున్న షరాయి తొడుగుకుని అదో మోస్త రుగా తలపాగా చుట్టుకున్న ఒకాయనతో మాట్లాడుతున్నారు ఆయనే వెంకట రత్నంనాయుడుగారని తరవాత తెలిసింది సమస్తం చెప్పాను మీనాక్షిసంగతి చెప్పుతూవుంటే నాయుడుగారు కళ్ళనీళ్ళు ఆపుకోలేకపోయారు 'గ్రేట్‌వుమన్, గ్రేట్‌వుమన్' అంటూవొచ్చారు పంతులుగారు గంభీరంగా ఆలోచిస్తూ విన్నారు నన్ను ఆరోజు అక్కడనే ఆపుజేశారు "మీకు పరీక్షలు దగ్గరకు వొస్తూన్నవి. అందుచేత దీనిలో విస్తారం ఇప్పుడు కలిగించుకోవొద్దు నేనువెంకయ్యకు ఉత్తరం ఇస్తాను" అని నాయుడుగారు సలహా ఇచ్చారు పంతులుగారు 'మీనాక్షి నగలను వ్యభిచారవృత్తి మాన్పించే ప్రయత్నాలకే వుపయోగిస్తాను ఆ అమ్మాయి విషయంలో చాలా జాగ్రత్తగా ప్రవర్తించాలి' అని పద్ధతులన్నీ చెప్పి "ఇదంతా వెంకయ్యగారితో చెప్పి మీ చదువుకు అభ్యంతరంలేకుండే సహాయం చేయండి. దీనిలో ఏ బాధలు కలిగినా టెలిగ్రాం ఇస్తే వెంటనే వొచ్చి చిక్కులన్నీ నేనే స్వయంగా పడతాను" అన్నారు.

నేను ఇంతపూర్తిగా మారిపోడానికి కారణం ఇది. ఇంతకుపూర్వం ఈ సంఘంస్థితి నేను యెరగను. కూకటివేళ్ళు ఇంత కుళ్ళి వున్నవని నాకు తెలియదు. పైపైనచూసి అంతా బాగానే వున్నది అనుకునేవాణ్ణి ఆనాటినుంచే దృష్టి తారుమారు అయింది ఇప్పటి హిందూసంఘమంతా బొమ్మలాటకం, పంతులుగారు చెప్పినట్టు మీనాక్షి వుత్తమురాలు, పతివ్రత. కడుపుకక్కుర్తికి కాస్సేపు శరీరాన్ని అమ్మకునే కులటకన్నా వెంకటశాస్త్రే యెక్కువ నీచపువ్యభిచారి పుట్టుక ఏం నిర్ణయించింది? పుట్టుకనుబట్టి భేదాలను నిర్ణయించే ఈ సంఘం దుర్మార్గంగా వుంది. నా కన్నులకట్లు తెగినవి. ఇంతకూ ఇదంతా నీతో ఎందుకు చెబుతున్నానంటే ఒక కారణం వున్నది నిన్న నీ నాటకం చదివాను ఆ అద్భుతమయిన రంగంలో లలిత చేత నీవు అనిపించిన ఆఖరిమాటలు మహాసత్యాలు, అనుభవంలో వాటివిలువను నేను గ్రహించాను నాలో కలిగినమార్పు స్ఫురించింది. నీవు యెంత అనుభవం మీద ఇంతచక్కగా చెప్పావా ఆమాటలు అనిపించింది, ఆ వాక్యాలు నామనస్సులో స్థిరంగా నడి పడిపోయినై.

నిజం, ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క మహానుభావుడు పుడతాడు. దూరదృష్టితో సమస్తాన్నీ తిలకించి, ఏ మార్పు కల్పిస్తే యెక్కువ ధర్మం కలుగుతుందో గ్రహించి, ఆతడు కాలాన్నే సరియైనదారికి తిప్పుతాడు ఆ తరవాత వ్యక్తులతో నిమిత్తం లేదు. రావలసిన మార్పు దానంతట అదే వొచ్చేస్తుంది. ఆ తరవాతనుంచీ తెలివైనవాళ్ళు గ్రహించుకొని సర్దుకోనైనా సర్దుకుంటారు. తెలివితక్కువవాళ్ళు ఎదిరించినా ప్రయోజనం వుండదు కాలం కల్పించేమార్పు ఇది.



## క్లియోపాత్రా

క్లియోపాత్రా 2,000 సంవత్సరాలక్రితం ఈజిప్టుదేశపు మహారాజ్ఞి ఎంతో సౌందర్యవతి. భోగి, తీరని ప్రేమపిపాసి ఈమెయౌవనం వుష్పించబోతూన్న తొందరవయస్సులో ఇటలీదేశంనుంచి సీజరు దండెత్తివొచ్చాడు, ఈజిప్టును స్వాధీన పరచుకోవలెనని. సీజరు మహాయోధుడు రోమునుంచి సాధారణసేనానిగా బయలుదేరి, అప్పుడు యూరపుఖండంలో జయించదగిన దేశాలను, గ్రాలు, బ్రిటనులను [అనగా ప్రేన్సు, ఇంగ్లండులను] సంపూర్ణంగా స్వాధీనపరుచుకుని స్వదేశ మన్ననకు పాత్రుడై, ప్రజలు మూడుసార్లు కిరీటాన్ని పాదాల దగ్గర పెడితే వొద్దని నిరాకరించి, మకుటంవినా చక్రవర్తిగా పాలించాడు

సీజరు, క్లియోపాత్రామీద యుద్ధానికివొచ్చేప్పటికి అతనిజీవితంలో వసంతం మినిమి తెల్లవారుతూ హేమంతాన్ని చేరుతూవుంది. ఇంతసీజరును, ఆ పద హారేళ్ల క్లియోపాత్రా, ప్రపంచాన్నంతా జయించిన ప్రతాపశాలిని; మేధాశక్తితో రోమునూ సామంతరాజ్యాలనూ ఎదిరింపుయెరగని తీవ్రతతో పాలిస్తూవున్న శక్తి మంతుణ్ణి, సీజరును, క్లియోపాత్రా, ముగ్ధ, విప్పారుతూవున్న, ఇంకా స్వశక్తి నైనా గ్రహించలేని యౌవనోద్రేకంలోవున్న క్లియోపాత్రా, బాలిక, ఒక్క చూపుతో, ఆసీజరును తనపాదాలదగ్గర కుక్కపిల్లగా చేసుకుని; ఆ సింహంతో వెలగాటలు ఆడుకున్నది సీజరు, పాపం ఎంత చక్రవర్తిఅయినా ప్రకృతికి బద్ధుడేగా! అన్నీ గడిచి సీతాకాలంవైపు కృశింపుదారిబడుతూవున్న శరీరాన్ని మోసుకు పోతూవున్నవాడికి, క్లియోపాత్రావేడి మొదట హాయి మనిపించింది. వెనకకు తిరిగి తరలిపోయిన ఆమనిని తిప్పుకోవలెననే యత్నంతో బ్రతుకు మళ్ళించాడు;

కాని తపనీమేష ప్రవృత్తి పొందుతూవున్న క్లియోపాత్రా వేడికి ఆగలేకపోయాడు ఈ సంపదంతత్వానికి తాళలేక తరలిపోయాడు

సీజరు గతించగానే మర్కి అంతశక్తితో అంతతీవ్రతతో సామ్రాజ్యానికంతకూ చేయూతనిచ్చి పునః దిగ్విజయం చేశాడు, ఏంటొనీ ఎంటొనీ మంచి యౌవనం పొగరులో వున్నాడు. వీరరసంతో ప్రపంచాన్ని దిగ్భ్రమజేసి, తనకీర్తి దిక్కుల పిక్కటిల్లజేశాడు క్లియోపాత్రా పొగరుబోతుతనమూ ధిక్కారమూ అణచవలెనని బయలుదేరాడు

అప్పటి ప్రపంచంలో రెండే మహారాజ్యాలు· రోము, ఈజిప్టు

అప్పుడు యిద్దరే ప్రపంచాతీత వ్యక్తులు రోమువీరుడు ఏంటొనీ, ఈజిప్టు మహారాజ్ఞి క్లియోపాత్రా.

ఏంటొనీ, ఈజిప్టును జయించడానికి బయలుదేరాడు క్లియోపాత్రాకు చాలా పౌరుషంగా పరుషంగా వార్తనంపాడు, "కొంగుతావా, లొంగదీయమంటావా" అని నిరసనగా నిశితంగా జవాబు పంపింది.

'రాయబారం జరిపి, పరస్పరం కలుసుకుని ముఖాముఖిని సంధికి యత్నించి, సరిపడకపోతే యుద్ధం' అనుకున్నారు.

ఏంటొనీ ఈజిప్టునుకూడా కొంగదీసి దాసిగా చేయగలడని, అటునుంచి రోమూ సామంతరాజ్యాలూ వోరిగి చూస్తూన్నవి, తమ గౌరవాన్నీ, దేశస్వాతంత్ర్యాన్నీ కాపాడుతుంది ఈ మహాశక్తిని గెంటివేసి అని ఈజిప్టు సర్వప్రజా ఊపిరి ఆపి చూస్తూవున్నది.

ఏంటొనీ సేనలతో కొంతదూరం వొచ్చి అక్కడ వేచివున్నాడు; క్లియోపాత్రా కొంతదూరం ఎదురువెళ్ళింది, సేనలతోకాదు తన సౌందర్యసర్వస్వం తోనూ, తన సమస్తవిలాసంతోనూ, చుక్కలవంటి తన చేటికలతోనూ, సస్యశ్యామల, ఫలప్రద, రత్నగర్భఅయిన ఈజిప్టు తన అమూల్యాన్నంతా ఆమె ఆలంకారాలకు పెచ్చించివేసింది ఆదినం. ఏంటొనీ, నాగరికప్రపంచానికంతకూ నడకలు

నేర్పుతూవున్న రోములోని యేరిన సౌందర్యాలను కాంచినవాడే, కాని ఈ మెరుపు చూసి సొలసిపోయాడు

ఒక్క కనురెప్ప, ప్రపంచం మారిపోయింది'

ఈజిప్టు, రోము, పాదాలకింద సింహాసనాలు'

క్లియోపాత్రా, చండశాసనురాలు మహారాజ్ఞి, ఏంటొనీ వీరాధివీరుడు చక్రవర్తి కారు, క్లియోపాత్రా సౌందర్యసర్వస్వాన్ని వాడిగట్టుకునివొచ్చిన మహావిలాసిని ఏంటోనీ ఒడలు నీరుగా మూగవడి మైమరిచిన అయోమయం

ఒక్కత్రుటి

అటు రోమూ సామంతరాజ్యాలూ సూస్తూనేవున్నవి ఇటు ఈజిప్టు యింకా ఆతురతతోనే వున్నది

ఏంటోనీ, క్లియోపాత్రాను వొళ్ళంతా కళ్ళుచేసుకుని మూర్ఛతో చూశాడు

క్లియోపాత్రా వొళ్ళంతా సౌందర్యం తెరుచుకుని అతన్ని మాయగా కప్పివేసి తనను తానూ, తెలిసికోవడంలేదు

ఒక్కత్రుటిలో, ప్రపంచం అంతా మారిపోయింది ఏంటోని ఏమీతెలియక అన్నాడు, "నియంత సౌందర్యాన్ని చూడలేః" అని

"ఏమిటీ, ఏంటోనీ ఇంత మెచ్చుకుంటాడా'" అన్నది క్లియోపాత్రా

యుద్ధసన్నద్ధమైన ఆ ప్రపంచమంతా మారిపోయింది, పుష్పశయ్యగా ఆ ప్రేయసీ ప్రియులకు;

ఆ వీరాధివీరుడు ఆ బాహులతలో సొమ్మసిల్లిపోయాడు ఆ విలాసిని అతని జీవితం వెన్నెలగా విరిసింది సంజమబ్బుల రంగులకన్నా తొందరగా వింత వింతగా మారిపోయే క్లియోపాత్రా విచిత్ర చిత్తవృత్తులను అనువిమేషం ఆనందంతో విలోకించడం, వాటిని అనుకూలంగా అనుసరిస్తూవుండడం ఏంటోని పని

రెండు మహారాజ్యాలనూ తమ ప్రేమకోరిన కోర్కెలకు సాధనసామగ్రిగా వాడుకున్నారు. రెండు రాజ్యాలలోనూవున్న విలువనంతా కొల్లగొట్టితమ పర్యాటలకు ఖర్చుపెట్టారు రోమూ, ఈజిప్టూ తహతహలాడిపోయినవి, ఈ వొళ్ళుతెలియని ప్రేమ కైపెక్కిన ప్రియుల సేవ చేయలేక,

వీరి అడతెగని కౌగిలింతలలో నలిగిపోయినవి. ఈమహారాజ్యాలు రెండూ.

వీరి ఆనందానికి చేసే వెవరో ఒ కొద్దిపాపం ఏలిగినా కోపాగ్నికి తహతహ లాడిపోయినవి,

ఈ ఒ పిరిసంపసి ఆనందాలనో, ఆటలలో, ఆర్భాటలలో ఆలసిపోయినవి, వీరి కౌగిలింతలలో నలిగిపోయినవి, వీరి అకారణకోపాలకు తహతహలాడి పోయినవి, రెండురాజ్యాలూ కిములుకుని వాధపడిదం ప్రారంభించినవి

ఇది అదనని అక్టేవియానసు ఎంచుకున్నాడు. ఎంటొనీ నిస్సత్తువగా వున్నప్పుడే ఏందెత్తి రెండురాజ్యాలనూ స్వాధీనంచేసుకుని ఏకఛత్రాధిపత్యం సాగించవలెనని, తగినసమయం చూసుకుని మహాసైన్యాన్ని నౌకాదళాన్నీ కూర్చుకుని ఈజిప్టుపదండయాత్రకు బయలుదేరాడు

వేగులు ఏంటోనీకి ఈ వార్త తెలివారు ప్రేమపొంగిపొర్లుతూవున్న రక్తంలోకి రంహిమని పాత వీరరక్తం ప్రవహించింది శరీరమంతా నెత్తురుజిమ్మి. కెంపులు చెక్కినట్టున్నది కెంపెక్కిన నేత్రాలతో దిశలంటా సింహావలోకనంచేసి 'ఈజిప్టు లే యుద్ధానికి' అన్నాడు

ప్రేమతో మెత్తనతో తనను వలయించుకుంటూవున్న ఏంటొనినేకాని, ఈ రుద్రమూర్తిని ఈ ప్రపంచాన్ని చూడలేక్లియోపాత్రా ఇంతవరకూ నిండుగర్వంతో అచ్చుపడేటట్టు చూసుకుంది ఈ ఏంటొనీని, ఈ వీరమూర్తి నిజస్వరూపం ఆజిలో తిలకించవలెనని అభిలాషపుట్టింది 'సరే!' అన్నది. ఈజిప్టు యావత్సైన్యం, నౌకాదళం, ఏంటొనీ మహాసైన్యం, ఆరితేరి నూరేసి యుద్ధాలు గెలిచిన అతిరథులతో ఏంటొనీ క్లియోపాత్రాలు ఆక్టేవియానసుకు ఎదురు వెళ్లారు

యుద్ధం ప్రారంభమైంది ఏంటొనీ వెయ్యికళ్ళతో చూస్తున్నాడు, ఆ పాత వీరుడికి తెలుసు, తాను విజృంభించేసమయం ఎప్పుడు వొచ్చేది. అదనుకోసం వేచి వున్నాడు. రక్తం వేడియెక్కుతూవుంది ఆమె అంతా విలాసంగా చూస్తోంది.

ఇంతలో విధిలో ఏదో సుడి పుట్టింది గభీమని క్లియోపాత్రా ఓడను మళ్ళించి పారిపోతూంది. ఏంటొనీ ఓడకూడా తిరిగిపోయింది క్లియోపాత్రావెంట ఏంటొనీ ఒక్కడే నిలవగల సమర్థుడే' ఆలోచనలేదు క్లియోపాత్రా వెళ్లిపోతూంది,

ఏంటొనీ వెళ్ళిపోతున్నాడు. క్లియోపాత్రా చుక్కాను, ఏంటొనీ ఓడ.

ఒకదాని వెనః వొకటి, ఆ రెండు ఓడలూ యింటిదారి పట్టగానే ఆక్టేవియానసు చెలరేగాడు, నౌకాదళాన్ని తుత్తునియలు చేశాడు, ఇక ఎలెగ్జాండ్రియాను ముట్టడిః స్తాడు క్లియోపాత్రా కంగారుగా కోటలోకి పారిపోయి, ద్వారాలు మూయించివేసింది. ఏంటొనీ వేరే భవనంలోకి వెళ్ళిపోయాడు

దెబ్బతినిన సింహం. ఓ రక్తం చిందిపోతూవున్నది. పరాభవం, జీవితంలో ఇన్నివందలయుద్ధాలలోనూ యెన్నడూ యెరగనిది. క్లియొపాత్రా రహస్యంగా ఆక్టేవియానసుతో సంధిచేసుకుని పారిపోయిందని మండిపోతున్నాడు రగులుతూన్న తీవ్రాగ్ని, దగ్గరకు రాలేరు యెవ్వరూ

క్లియోపాత్రాకు ఏమీ తోచలేదు భయంకరంగా వున్నది అంతా ఏంటొనీకి ఏమని కబురు, ఎలా క్షమింపుతాడు! ఏమీతోచలేదు. విషంతిని చచ్చిపోయింది అని కబురు చేసింది

ఈ వార్త చెవిని పడింది ఊరికే అటూ యిటూ పచారుచేస్తున్నవాడు స్తంభంలా నిలబడిపోయాడు "క్లియోపాత్రా చచ్చిపోయిందా! ఇక ఏంటొనీకి ప్రపంచం లేదు. ప్రపంచంలో వున్న ప్రేమా, సౌందర్యమూ, అన్నీ నశించిపోయినవి. ఐరాస్, నిన్ను ఒక పేదకుటుంబంలోనుంచి తీసి యింతటిస్థితికి తీసుకు వొచ్చాను నీవు నీ ప్రభువుసేవ చేసే సమయం వొచ్చింది నీ కత్తితీసి నన్ను పొడిచివేయి," అన్నాడు. ఏంటొనీ దృఢసంకల్పం యెరుగును ఐరాస్. కత్తిదూసి తన్ను తానే పొడుచుకున్నాడు "భలే సౌఖయవు, గొప్ప విశ్వాసం చూపించావు, నాకు దారిచూపావు" అని కత్తి తీసి గుండెల్లో పొడుచుకుని పడిపోయాడు. ఏంటొనీ

భూమి దద్దరిల్లింది

క్లియోపాత్రాకు వెంటనే వార్త తెలిసింది. గొల్లుమని ఒక్కటే యేడ్పు మృత్యువుదరి చేరుతూవున్న ఏంటొనీని తన కోటలోకి రప్పించుకుంది ఈ మరణం, ఆ యేడుపూ చూస్తూవున్న ప్రపంచంఅంతా కోయ్యబారి. కారిపోతూవున్న కన్నీళ్ళు తుడుచుకుంటూవుంది ఏంటొనీ అన్నాడు "ఏడుపుయెందుకు; ఇటురా, పక్కను పడుకో" అని.

తొలిసమావేశంలో కలుసుకున్నట్టు అన్నీ మరిచిపోయారు ఓ ముద్దులు, ఆలింగనాలు, ఆ రక్తప్రవాహంలో వొళ్ళుమరిచిపోయి చిన్నపిల్లలవలె ఏవో అర్థం లేని మాటలన్నీ చెప్పుకున్నారు

కాలం భూత భవిష్యత్తులు ముడుచుకొని అక్కడ ఒక్క వర్తమానంగా నిలిచిపోయింది పాత సంగతులన్నీ చెప్పుకుంటున్నారు, వొళ్ళుమరిచిపోతున్నారు ఆ కౌంగిలో, ఆ వాడలు తెలియని ప్రేమనో. ఏంటోనీ శిరస్సు క్లియోపాత్రావొడిలో వాల్చి నిద్రించాడు, స్థిరంగా. బ్రహ్మాండం గుండె బద్దలయ్యేటట్టు యేడ్చి వేసింది హఠాత్తుగా అపుకున్నది 'ఒక్కవిటికలో సునాయాసంగా ప్రాణం హరించే విషాన్ని తీసుకురమ్మన్నది.

తొలినాడు ఏంటోనిని చూడడానికి వెళ్ళిన నాటి దుస్తులూ అలంకారాలూ అన్నీ తీయించింది మహా వైభవంగా తొలి సమావేశం అంత ఆడంబరంగా అలం కరించుకుంది. అద్దంలో చూసుకుని, ఆ అపూర్వశోభ ఎక్కడిమంచి వొచ్చిందా తన వదనంలోకి అని ఆశ్చర్యపడింది తన సౌందర్యానికి తాను యెన్నడూ గర్వపడనట్టు గర్వించింది ఆ సౌందర్యార్చనలో ఒక్కత్రుటి సర్వం మరిచిపోయింది. కన్నులు పెద్దచేసుకుంటూ ఎప్పుడూ తిలకించని కొత్తకాంతిలో తన్ను తాను చూసుకుంటూ వుంది. ఇంతలో అంతా జ్ఞాపకంవొచ్చింది "ఏంటోనీ, వొస్తున్నా!" అని విషంతాగి, ఏంటోనీకౌగిలిలోకి వొరిగిపోయింది.

నశరీరులై వున్నప్పుడు ఎన్నడూ యెరగని, అణువు అణువూ ఆలింగనంలో, సజీవ కణాలుగా, ఒక్కశరీరంగా, మట్టికౌగిలిలో ఒకరినొకరు అతుక్కునిపోయారు భూమి పులకరిస్తూ గర్వంగా అందుకుంది వాళ్ళని. ఆ ప్రేమ తలుచుకున్నప్పుడల్లా భూమి పువ్వులు పులకరిస్తూవుంటుంది, ఆ అపూర్వప్రేమసౌరభం ప్రపంచం గుండెలు తాకడానికి



## తె లి వి

"మే ఏఏ .          "

"మే ఏఏ          "

పిల్ల తల్లివేపు చూసింది మళ్ళీ నక్షత్రాలను చూసింది.

"మే ఏఏ   " అంది

"మే ఏఏ   " అంది తల్లి తిరిగీ

అంతే, నక్షత్రాలనుచూస్తూ నెమరువేసుకుంటూ నిద్రపోయింది మేకపిల్ల.

*                    *                    *

"అమ్మా, అవి   " అంది లీల, నక్షత్రాలను వేలితో చూపుతూ

"అవా! నక్షత్రాలు   తల్లీ, నక్షత్రాలు అను, న–క్ష–త్రా–లు."

"నచ్చి   నచ్చ   " అనలేంపోయింది

"అవేమిటి?" అన్నది మళ్ళీ

"అవేం, నక్షత్రాలు, అక్కడేం, దేవు ఉంటాడు, దేవుడికి దణ్ణంపెట్టమ్మా! జేజి, జేజి" అని రెండుచేతులూ కలిపి దణ్ణపెట్టించింది గమ్మత్తుగావున్నది అంతా నిద్రముంచుకుని వొస్తూవున్న మనసులో దేవుడు దేవు దనే ప్రతిధ్వనులతో కల వరింపులో కదిలి దణ్ణంపెడుతూ నిద్రపోయింది లీల.

## 2

వొచ్చిన పిల్ల లన్నిటితోనూ గంతులువేసి ఆడుకుంది మేకపిల్లని వాటిన్ని పొడిచింది. అవి పొడిస్తే వెంగుమని గెంతింది తల్లికూడా పిల్లతోపాటు పరుగులెత్తి

అవి ఎక్కడికి వెడితే అక్కడకు వెళ్ళి అడి చెట్టునీడను పడుకుంది. పిల్ల ఆడుకుంటూ వుంటే ఆనందంగా చూస్తూ

*　　　　*　　　　*

లీలతో ఆడుకోవానికి పిల్లలు వొచ్చారు కొంతసేపు అందరితోనూ ఆడు కుంది మేకపిల్లల్ని తరిమారు. ఒక మేకపిల్ల వంటింట్లో దూరితే దానివెంట అందరు పిల్లలూ వంటింటిలోకి పరుగెత్తారు. పిల్లలు ఇళ్ళకు వెళ్ళాక, లీలను పిలిచి వాళ్ళమ్మ చివాట్లు పెట్టింది. "సుబ్బి వాళ్ళూ శూద్రాళ్ళు, వాళ్ళతో నీవు చనువుగా ఆడకూడదు. వాళ్ళని వంటింలోకి రానీయకూడదు" అని రాత్రి నిద్రలో లీల పలవరించింది ఆ హృదయంలోని నిర్మలమైన రక్తంలొ ఒక విరుపు విరిగింది

*　　　　*　　　　*

మర్నాడు లీలయింటికి ఎవ్వరో వొచ్చారు వాళ్ళలో ఒక అబ్బాయికూడా ఉన్నాడు. అతన్ని 'బావ' అన్నారు బావకు మంచినీళ్ళు ఇమ్మన్నారు అందరూ అంటూవున్న విధానంలోనూ, వాళ్ళచిరునవ్వులలోనూ లీలకు ఏదో సిగ్గు అలవా టయింది నెమ్మదిగా 'బావను పెళ్ళాడుతావా' అనీ, 'పెళ్ళాడుతా'ననీ అనిపిం చారు. లీలమనసులొ ఏవో అర్థంకాని మార్పులు రావడం ప్రారంభమయినై.

## 3

ఒకనాడు మేకపిల్లకు కడుపునొప్పి వొచ్చింది మేఏ. అని తెగ ఏడ్చింది. తల్లి దాన్తోకూడా మేఏ. అంటూ వెంట తిరిగి దగ్గరసా పడుకుంది. ఆరోజంతా మేకపిల్ల ఏమీ తినలేదు నొప్పి తగ్గింది.

*　　　　*　　　　*

లీలకు ఒకనాడు అజీర్ణంచేసింది. ఆకలి లేదంటూవున్నా అమ్మ బలవంతంగా అన్నం పెట్టింది. మర్నాడు జ్వరం తగిలింది డాక్టరు వొచ్చాడు మందు ఇస్తున్నా పది దినాలు బాధపడింది లీల

## 4

దూడ ఏపుగా యెదుగుతూవున్నదనీ, వొళ్ళు బాగాచేస్తూవుందనీ ఆనందించారు దూడ మామూలుగా మందలోకి కోడెలతోనూ పెయ్యలతోనూ ఆడుకుంటూ వెళ్లేది. దానిస్వాతంత్ర్యానికి ఏ అడ్డూలేదు.

*　　　*　　　*

లీలకు వయసు వొస్తూవుంది. ఆమె చదువుకునే కిటికీయెదురుగా శాస్త్రిగారి అబ్బాయి వాళ్ల కిటికీ వద్ద కూర్చుని చదవడం ప్రారంభించాడు

ఒకనాడు లీలతండ్రి ఆమెబల్ల రెండవగదిలో వేయించి, ఆ కిటీలోనుంచి రోడ్డుధూళి వొస్తూవున్నదనీ, అది అనారోగ్యమనీ సాకులు చెప్పాడు. తెలివైనపిల్ల కనుక, కనిపెట్టి తనస్వాతంత్ర్యాలను తానే నెమ్మదిగా అరికట్టుకోవడం నేర్చుకుంది.

పరాయి మగవాళ్ళు వొస్తే, లేచి వోపలకువెళ్లిపోవడం అనవసరంగా కూడా ఎక్కువ అణకువగా వుండడం ప్రారంభించింది ఈ మార్పులో తోచకపోవడం, ఏదో అర్థంకాని దిగులూ, వీటికి అలవాటు పడిపోతూవుంది శరీరం వయసుకి తగినట్టుగా పెరగడం మానివేసింది.

## 5

దూడ ఊరికే అరవడం, కట్లు తెంపుకోబోవడం, చిరాకుపడడం ప్రారంభించింది యెదోయింది అన్నారు. మర్నాడు ఆలోచించి దాటడానికి అన్నివిధాలా నచ్చిన సరిపోయిన తోటపెద్దను ఎంచి అక్కడికి తీసుకువెళ్లారు।

*　　　*　　　*

లీల తల్లి దగ్గరకు వొచ్చి 'అమ్మా, వొళ్ళేమో చలిచలిగా వుంది ఏమీ తోచడంలేదు' అన్నది, 'కప్పుకుని పడుకో, మందు తెప్పించుతా' నని అన్నది అమ్మ. పసుపురాసి చాపమీద వేరే కూచోబెట్టారు, ఒక కొబ్బరికాయ ఎందుకో

పక్కనుపెట్టి. ఇరు గమ్మలక్కలంతా చూడ్డానికి రావడం, ఊరికే సంబరపడడం బావకి పసుపు ఉత్తరం వెంటనే పంపించారు.

ఆ మర్నాటినుంచి మగవాళ్ళంటే లీలకు వింతభావం, జంకూ. పూర్వప్రకృతి అంతా మారిపోయింది

## 6

ఆవు ఈనుతూవున్నదని చెట్టుకు కట్టివేసి చూస్తూ కూర్చున్నారు. కాస్సేపు బాధపడింది విందులు తొక్కింది దూడ బయటపడింది పదేపడటంతోనే దూడవొంటినివున్న మైలనంతా ఆవు నాకివేసి శుభ్రంచేసుకుంది. దూడ రెండు సార్లు లేవబోయి కింద పడిపోయింది మూడోసారి లేచి తడుముకుంటూ ముట్టె పొదుగులో పెట్టి పాలు తాగడం ప్రారంభించింది. ఆవు దూడవొళ్ళు అతి అప్యాయంగా నాకుకుంటూవుంది

లీలకు పురుడువొస్తూవున్నది అనగానే మంత్రసానికీ డాక్టరుకూ కబుర్లు పంపారు. ఏవిధంగానూ గాలి తగలని చీకటిగది ఖాళీచేసి పురిటిగది చేశారు.

లీల చాలా బాధపడింది కనలేకపోయింది. బిడ్డను 'ఫార్సెప్సు' తో బయటకు తీశారు 'ఇంత నీరసంగావున్న పిల్లలకు ఇంతత్వరలో ఈ స్థితులు రప్పించడం ఈ దేశం మూర్ఖత' అని డాక్టరు విసుక్కున్నాడు 'ఏం చెయ్యం పిల్లవాడి అమ్మమ్మ పట్టుబట్టింది, వాళ్ళకు లొంగక తప్పిందికాదు' అన్నారు.

పుట్టిన కొంతసేపటికే బిడ్డ పోయింది లీలకు ఇంకా స్మృతి లేదు.

మర్నాడు, డాక్టరు చాలా చివాట్లు పెట్టాడు. గాలిరాని చీకటిగదీ, ఈ వెల్లుల్లి యింగువా వాసనలగదీ, వొదిలి వసారా పక్కగదిలోకి మార్చమని విన్నారుకాదు. 'ఈ యింగ్లీషు డాక్టర్లు ఇంతే'నని

లీల మంచంమీదనే వున్నది యింకా. ఇంతలో పిడుగులాంటి వార్త:

ఆమె భర్త గోదావరిలో యీదడానికివెళ్ళి మునిగిపోయినాడని ఇల్లంతా గొల్లు మన్నారు లీల స్మృతితప్పి పడిపోయింది మంచం మీదనుంచి కిందకు

రెండునెల లయింది. లీల లేవగలుతూవున్నా ఏమీ ఓపికలేదు. తరుచు హిస్టీరియా. గుమ్మంలోకి వెళ్ళి ఎప్పుడైనా దూడనుగాని మేకల్లనుగాని చూస్తే స్మృతితప్పి పడిపొయ్యేది.

# 7

డాక్టరు ఏదో తైలం యిచ్చి రెండుపూటలా తలకు మర్దనా చెయ్యమన్నాడు. 'ఇంతజుట్టుకన్నా కొంత కత్తిరిస్తే బాగుంటుంది' అన్నాడు ఈ మాట ఇంట్లో తర్కించుకున్నారు. దొరసానుల్లా అదేమిటి అన్నారు. అంతపెద్ద అందమైన జుట్టు అన్నారు. అంతా వింటున్న గోవులమ్మ హఠాత్తుగా వొచ్చి 'ఏమిటీతెలివి? అతను పోనేపోయాడు. ఏనాడైనా ఎలాగా తప్పదు. ఏదో దాని కర్మం యేంచేస్తాం గనక. సమయానికి అన్నివిధాలా కలిసి వొస్తుంది. శుభ్రంగా తీయించండి. రేపు మంచిరోజు. ఆ మంగలిని ఎలాగా రమ్మన్నాను' అన్నది—ఆవిడ ఎప్పుడూ గోవులపంచే కట్టుకుంటుంది అందుచేత అందరూ ఆవిణ్ణి గోవులమ్మ అంటారు. ఆవిడకు జుట్టుండగా చూసినవాళ్ళు ఆ చుట్టుపక్కల ఎవ్వరూలేరు.

విచారిస్తూవున్నా తీయించడానికి అంధరూ నిశ్చయించారు హఠాత్తుగా లీల స్మృతితప్పి పడిపోయింది. హిస్టీరియా వొచ్చిందన్నారు చాలాసేపు కొట్టుకుంది.

బాగా తెలివి వొచ్చేప్పటికి చీకటిపడుతూవుంది. తెలివివొస్తూవుంటే ఏలనో చిన్ననాటి మేకపిల్లా, కుక్కా, పిల్లిపిల్లా, దూడా అన్నీ జ్ఞాపకాలురావడం ప్రారంభించినై. అన్నింటినీ తలుచుకుంటూవుంటే ఏడుపు వొచ్చింది నా గతే ఇలా కావలెనా అని ఏడ్చింది. నిడి వేలాడుతూవున్న జుట్టు చేతికి తగలగానే పొంగి పోసుకు వొచ్చింది దుఃఖం ఆ జుట్టంతా కళ్ళమీద కప్పుకుంది 'రేపటితో సరా ఈ జుట్టు బొను. ఏ సుఖంలేని జీవితానికి ఈ సౌభాగ్యం యెందుకు. ఇదేమితెలివి' అని అనుకుంది ఇంతలో గోవులమ్మస్వరూపం జ్ఞాపకం వొచ్చింది. కెవ్వుమని కేక వేసింది. స్మృతి తప్పింది. పాడు హిస్టీరియా మళ్ళీవొచ్చింది అన్నారు.

# 8

గోవులమ్మా తానూ కలిసి వొచ్చారు. ఇంట్లోకి వెళ్ళి నలుగురి కళ్ళనూ పడడానికి మనస్సొప్పిందికాదు. అందుకని పెరటివేపు వెళ్ళింది. చిన్ననాటినుంచీ తన ఆటపాటలతో పెరిగిన జంతువులన్నీ తనను వింతగా చూస్తున్నవి దగ్గిరసా వెళ్ళబోతే దూడ వింతగా చూసి పారిపోయింది. ఇంతలో యింట్లోనుంచి కుక్క వొచ్చి భొంయ్యిమని మీదపడింది.లీల కెవ్వుమని కేకవేసి తెలివితప్పి పడిపోయింది.

అందరూ పరుగెత్తుకుని వొచ్చారు. ఆ పడడంలో బోడి తలకు రాయి తగిలి కొంచెం నెత్తురు కారడం ప్రారంభమైంది చేతులమీద లోపలకు మోసుకు పొయ్యారు

బెదిరిన దూడ ఆవుదగ్గరకు చేరింది ఆవు బెదురుచూపులు చూస్తూ తోకయెత్తి నిలబడినదూడను నాకుతూవుంది. కుక్క యింకా మొరుగుతూవుంటే సూర్యం దాన్ని బెదిరించి కొట్టాడు. పిల్లి మ్యావని అందరినీ రాసుకుంటూ తిరిగి పొయ్యి మూలకు పోయి పడుకుంది.

విసుక్కుంటూ గోవులమ్మ అన్నది' 'వెధవతెలివి, పాడు మందులన్నీ యిచ్చి దాని మతి చెడగొట్టక ఊరుకోండి పొద్దున్నతో దాని బాధంతా వొదిలింది. ఇంక దానంతటదే బాగుంటుంది'. అని.



# ప్రైమ్మినిస్టర్

'మానవుల చర్యలు చూస్తున్నకొద్దీ కుక్కలమీద గౌరవం హెచ్చుతూ వున్న'దని ఒక ఫ్రెంచి వ్యాసకర్త వ్రాసినాడని చెప్పుతూ, మా ప్రైమ్మినిస్టరును తట్టినాడు నా స్నేహితుడు తగిన బాహ్యచిహ్నాలతో కృతజ్ఞత చూపుతూ «ఔను» అన్నది ప్రైమ్మినిస్టర్

ప్రైమ్మినిస్టరంటే చాలామందికి తెలియదు మా పెంపుడుకుక్క. ఈ పేరు పెట్టడానికి చాలా కారణాలున్నవి ప్రస్తుతం అన్ని పాశ్చాత్యదేశాలలో అందులో ముఖ్యంగా ఇంగ్లాండులో ప్రధానమంత్రి స్వభావం కుక్కవంటిది గాలి కదిలినా ఏ దేశమో, ఏ విరోధిజాతో దండయాత్ర తమపైకే వొస్తూవున్నదని అనుమానపడి, భోంయిమని దేశమంతా అల్లరిచేయడం, తన దేశాన్నీ ప్రజల్నీ కావలికుక్కవలె కాపాడుతున్నా ననుకుని, ఇతరదేశస్థులు పెద్దమనుష్యు లెవరైనా సదుద్దేశంతో సవినయంగా ఏ కోర్కెలు తెలపడానికో, ఏ హక్కులను గురించి అడగడానికో వొస్తే ఇల్లూవాడా కదిలి కంగారుపడేటంత గోలచేయడమున్నూ.

మా కుక్కకు ఈ పేరుపెట్టడానికి ఈసమానలక్షణాలే కాకుండా ఇంకో కారణంకూడా వున్నది

నామకరణం అంటే మజాకాకాదు పిల్లలుగలవాళ్ళకి తెలుసును ఈ పాట్లు. తొమ్మిదినెలలూ, పుట్టిన తరువాత నామకరణం చేసేవరకూ మంచిపేరు పెట్టవలెనని ఎంత ఆలోచించినా, ఎన్నిపేర్లు వెతికినా, ఒక్కటీ తోచకపోవడమూ పాతపేర్లు ఒక్కటీ అతక్కపోవడమూ, చివరకు ప్రాణంవిసిగి ఆ సమయానికి ఏ అమ్మమ్మో ఆగ్రహిస్తే తప్పనిసరిగా ఆవిడ అసహ్యమయిన పేరే పెట్టడం మామూలు.

కుక్కపిల్లను కొందా మనుకున్నప్పటినుంచీ ఆలోచించాను పేరునుగురించి; స్నేహితులను అనేకమందిని అడిగాను

విక్టోరియాహాస్టలు విద్యార్థులు నవనాగరికులు ఫేషనబుల్‌గా' వుంటారని వాళ్ళ నడిగితే, యూరోపియన్ పేర్లు దాగావుంటవి అన్నారు కొందరు నాన్కో-పరేషను వాళ్ళ నడిగితే, 'దయరు, ఒడయరు, క్లయివు, నీలు ఏదైనా పెట్టమన్నారు, కసిగా. ఇంకా యితరులు, టెర్రర్, ఫైడెలిటీ, ఫైత్ఫుల్, లిలీ, బూచి, సీజర్, ఏవో చాలా చెప్పారు.ఏదీ నాకు నచ్చలేదు, కాలమే నిర్ణయించింది తుదకు.

కుక్కపిల్లను కొన్న నిమిషం ఒకస్నేహితుడు వొచ్చి, 'వార్తాపత్రిక చూశావా, ఇంగ్లాండులో ఎన్నికలు తెలిసినవి, ప్రైమ్మినిస్టరును ఎన్నుకున్నా'రన్నాడు. ప్రధానమంత్రి, అపదవీగురించి చాలా మాట్లాడుకున్నాము వెంటనే తోచింది ఆపేరే కుక్కకు పెట్టవలెనని ఒక దౌర్భాగ్యపు కుక్కపిల్లకు పేరు పెట్టడానికి ఇంత గోలా ఇంత శ్రమా ఎందుకు అంటారు చాలామంది బుద్ధిమంతులు

కుక్కఅంటే సామాన్యమయిన జంతువుకాదు. విశ్వాసంలో స్నేహితుణ్ణి మించింది, కాపుదలలో బంటును అతిక్రమించింది దేశచరిత్రలలో శాశ్వతంగా యశస్సు గడించిన మహాపురుషులలో సమంగా అనేక శునకాల పేర్లుకూడా కాలాన్ని ధిక్కరించి, మృత్యువు నెదిరించి జీవన్మృతములైనవి మొన్ననే విన్నాము, శ్రీ శివాజీమహారాజు చనిపోయినప్పుడు ఆయన చితిలోకి వురికి మృత్యువులో కూడా ప్రభువు ననుసరించిన ఆయన పెంపుడుకుక్క చరిత్ర జాతీయధర్మాలనూ, గౌరవాన్నీ కాపాడుకోవలెనన్న సంగతి కన్నులువిప్పి గ్రహించిన భారతీయులు ఆ శునకశ్రేష్ఠానికి వొక పెద్దగోరీ కట్టించి, దానిపేరూ, యశస్సూ స్థిరంగా నిలపడానికి యత్నిస్తున్నారు. దేశగౌరవాన్ని కాపాడడానికి ప్రాణాలర్పించిన నెల్సను, కిచెనరువంటి వీరాగ్రేసరులతో తులతూగే హెల్వెల్లెనుకుక్క, ల్యూవెల్లెను కుక్క, ఇంకా అనేక శునకాలు వున్నవి ఏదో వంశాన్ని నిలుపుతా డనుకుంటే మయినారిటీ తీరగానే పంపకానికి నోటీసిచ్చే పుత్రుని నామకరణానికి పడే శ్రమలో

కొంతశ్రమయినా పడకూడదా మానమూ, ప్రాణమూ, ధనమూ కాపాడేందుకు ప్రాణాలైనా అర్పించే విశ్వాసపాత్రమైనదానికి సరియైన పేరు పెట్టాడానికి '

మానవులచర్యలు చూస్తూన్నకొద్దీ, కుక్కలమీద గౌరవం హెచ్చక పోయినా, ఈ రెండుజాతులకూ చాలా పోలికలు కనిపించగలవు కుశాగ్రంగా చూస్తే ఇంగ్లీషువాడికి బుల్డాగ్గు కుండే పట్టుదలా, కావలికుక్కకుండే జాగరూకతా వున్నవి నోటితో బుట్టపట్టుకుని బజారుపని చేసుకుని వొచ్చే కుక్కలున్నవి, ఆ జాతిలోని వాడు అమెరికావాడు ఒక గొర్రెలకాపరి కొండనెరియలో పడి చనిపోతే నిద్రాహారాలు మాని, ఆ అస్థిపంజరాన్ని కనిపెట్టుకున్న కుక్కకథ విన్నాం, ఆ జాతిలోని వాడు కేసాబయాంకా స్కాచ్చివాడు వేటకుక్కజాతిలో వాడు బుద్ధికుశలతలోనూ, చురుకుదనంలోనూ ఫాక్సుటెర్రియరు జాతిలోవాడు ఐరిషువాడు రష్యావాడు మంద కుక్కజాతిలోవాడు అరవవాడు ఊరికే మొరిగే జాతిలోవాడు. బెంగాలీవాడు చడీ చప్పుడూ లేకుండా పిక్కపట్టుకునే జాతిలోవాడు,

ఒక్క కుక్కజాతేకాదు; ఇతర జంతువులకూ మానవులకూ సమానలక్షణా లున్నవి. ' హిందువుడు పిల్లిజాతిలోవాడు అందుచేతనే కుక్కను ముట్టుకుంటే అంటని వొంకపెట్టాడు పిల్లికీ కుక్కకూ అసలే పడదు గదా పిల్లి ఎప్పుడూ ఇల్లు కనిపెట్టి వుంటుంది. దానికి యజమానీ మనుష్యులూ సంబంధం లేదు. సాధ్యమైనంత వరకూ వొకరి శొంఠీ, వొకరి జోలీ అక్కర్లేదు మచ్చిక చేస్తే దగ్గరగా వొస్తుంది, కాని ఎంత లాలించినా, ఎంత వూరించినా వెంటరాదు, ఇల్లె కనిపెట్టుకుని ఉంటుంది

తెల్లవాడు కుక్కజాతిలోనివాడు వీడికి ప్రదేశంతో సంబంధంలేదు. కుక్క యజమానిని విశ్వసించినట్టుగా ఇతడు ధనాన్ని నమ్ముతాడు తోక ఆడిస్తూ ఆ వెంట పడతాడు ఎంతైనా వోర్చి తెగించి కాపలా కాస్తాడు ఇంకొకరిని ముట్టనియ్యడు. ఈ యజమాని ఎక్కడ వుంటే అక్కడ వుంటాడు

బాగా ఆలోచిస్తే ఈ పోలికలు చాలా నిజంగా కనపడగలవు. కుక్కకు పిల్లి లోకువగదా! అలాగా పాశ్చాత్యుడికి హిందువుడు లోకువ. ఇంకో సంగతి,

ఇల్లు పాడైపోయినా పిల్లి వదలదు విచారంగా నశించినగొప్పనుగురించి కాపోసు కలలుకంటూ అక్కడే పడివుంటుంది కుక్క అలా కాదు. ఇల్లు పాడైతే యజమానితోపాటు మకాం ఇట్టే మారుస్తుంది దానికి స్థలంకొత్త లేదు జోస్తీ అతి త్వరితంగా చేస్తుంది ఒకముక్క పారవేసినా, కొంచెం చనువుగాతట్టినా, సస్నేహంగా చూసినా, 'థ్యాంక్యూ' అని తోక ఆడిస్తూ కృతజ్ఞత వెంటనే చూపుతుంది. పిల్లికి ఈ పేచీలు ఏమీ చేతకావు స్థలం, చచ్చినా మార్చదు కదా! ఎంతో చనువుగా చూస్తేనేకాని దగ్గరకురాదు, ఒకవేళ వొచ్చినా మ్యావని ఒకసారి రాసుకుని మళ్ళీ వెంటనే 'నీజోలి నాకెందుకు, నాజోలి నీకెందుకు' అన్నట్టు వేదాంతంగా వెళ్ళిపోతుంది.

భారతీయ పాశ్చాత్యభేదం మాదండి ఈ విషయాల్లో పాశ్చాత్యుడు టిక్కెట్లు మారకపోతే స్వదేశంనుంచైనా ఇట్టే మకాం మారుస్తాడు. స్థలం కొత్త లేదు. వీళ్లైతే భౌంయిమని భయపెట్టి, లేకపోతే తోక ఆడిస్తూ 'థ్యాంక్యూ'లతో స్నేహం, చూపుతూ కార్యం నిర్వహిస్తాడు హిందువుడు చచ్చినా దేశం వదలడు. అట్టే ఎవరితోనూ పూసుకుని తిరగడు, వెలిగా వుంటాడు ఎంతసేపూ పాడుయింట్లో పిల్లిలా నశించిన తాతముత్తాతల గొప్పా, గౌరవమూ తలుచుకుంటూ శ్మశాన దృష్టితో స్వప్నాలలో జపం చేస్తుంటాడు.

జంతుజాలానికివుండే శక్తులు తక్కువ కావడంవల్ల అవి యెప్పుడూ ప్రకృతిని అనుసరించి వొకేపంథాను వెళ్ళుతూ వున్నవి మనుష్యుడు బుద్ధి అధికంగా ప్రయోగించడంవల్ల ఒక అడుగు ఇటువేసినా ఒక అడుగు అటువేసినా ప్రకృతికి మహా దూరంగాపోయి అతీతుడో, అధమాధముడో అయిపోతున్నాడు, తప్పుదారులు తొక్కుతూన్న మానవాళిని చూసి ఫ్రెంచివ్యాసకర్త కుక్కలమీద గౌరవం హెచ్చు చేసుకున్నాడు. కేవలం ఈ శతాబ్దం మనుష్యులమీద నిరసనా, హేయతా చూపడానికి శునకాలమీద గౌరవం హెచ్చించుకున్న వ్యాసకర్త మా ప్రైమ్మినిస్టరులాంటి శునకశ్రేష్ఠాన్నీ, దాని చురుకూ సుగుణాలనూ అవగాహన చేసుకుంటే, ప్రైమ్మినిస్టరునీ, ఆ జాతినీ పూజించేవాడనుకుంటాను.

# పదిరూపాయీల టికెట్

'టికెట్ టికెట్' అని భుజంమీదను కత్తిరితో కొట్టి లేపితే నెమ్మదిగా కళ్ళు తెరిచి, ఒకక్షణం టికెట్‌కలెక్టర్ని చూసి, మళ్ళీ కన్నులు మూసివేశాడు. ఈ నిర్లక్ష్యానికి టికెట్‌కలెక్టర్‌కి కోపం వొచ్చింది. ఘట్టిగా భుజం పట్టి దభాయింపుగా 'టికెట్ చూపవయ్యా!' అన్నాడు.

అతడు మళ్ళీ నెమ్మదిగా కళ్ళు తెరిచి లేచి కూర్చుని, టికెట్‌కలెక్టర్ని ఒకతృటి పరకాయించి చూసి, నెమ్మదిగా జేబీలోనుంచి అకుపచ్చని పదిరూపాయీల టికెట్ తీసి యిచ్చి, పూర్వవిధినే పరుపుకట్టమీదకు వొరిగి కన్నులు మూశాడు. చేతిలోని టికెట్‌ని అతన్నీ రెండుమూడుసారులు ఎగాదిగ చూసి, 'ఇది మీటిక్కెట్టేనా' అని ప్రశ్నించాడు టికెట్‌కలెక్టర్. అతడు ఏమీ మాట్లాడలేదు, కన్నులు తెరిచి మళ్ళీ మూసివేశాడు. ఈ సారి టికెట్‌కలెక్టర్ పెదవి కొరికి కన్నులు ఉరిమి చూస్తూ, 'ఈవేషాలు నాదగ్గర పనికిరావు. సెప్పు ఇట్లాటిదేనా?' అంటూ బండిలో వున్న యితర పేసెంజర్లవేపు తిరిగి, 'చూడండి, ఎవరిదో వేలిముద్రటికెట్ పట్టుకుని ప్రయాణం చేస్తున్నాడు, పైగా వేషం. జవాబు చెప్పకుండా, ఏమనుకున్నాడో కన్నులు మూస్తున్నాడు' అంటూ, 'ఏమ్, లేవయ్యా, ఏం డాబుచేస్తున్నావ్ జాగ్రత్త, అనేటప్పటికి, అతను లేచి కూర్చుని మళ్ళీ పూర్వవిధంగానే టికెట్‌కలెక్టర్ని చూసి ఊరుకున్నాడు.

అవతలి బల్లమీదను కూర్చుని నోరుతెరిచి చూస్తూవున్న శాస్త్రులవారు కలగజేసికొని 'అయ్యా టిక్కెట్టుకలక్టరుగారూ, లొందరపడకండి' అంటూ వున్నప్పటికీ ఆగకుండా, తన ఉపన్యాసశక్తిగర్వంతో సభను కలియజూసే సత్యమూర్తి

లాగ ప్రయాణీకుల్ని అందరినీ కలియజూసి; ఉపన్యాసం ప్రారంభించాడు "ఇటు వంటివాళ్ళని నేను ఎందరినో చూశాను. ఈ టికెట్లు ప్రారంభించిన వారంరోజుల లోనూ పాతికమందిని పట్టుకున్నాను, చూడడంతోనే అసలు మనిషిని గ్రహించ గలను ఆ మొహం చూడండి, వాగా చదువుకున్న మనిషిలా కనబడుతూనే వున్నాడు, వేలిముద్ర వేసిన మరెవరిటికెట్తో పట్టుకుని ఒయలుదేరాడు, ఆమాత్రం చూసి గ్రహించలేననుకున్నాడు కాబోలు" అంటూ అతన్ని ఉద్దేశించి, "ఏమంటా వయ్యా? మాట్లాడకుండా ఊరుకుంటే తివాగా వుండిపోనుకున్నావుకాబోసు. జాగ్రత్త ఎవరనుకున్నావో మరి" అనేప్పటికి బండిలోవున్న నలుగురూ కలగజేసికొని నాలుగువిధాలా ప్రతిమాలడం మొదలుపెట్టారు

శాస్త్రులవారు పొడుంపట్టు పీల్చివేసి, 'టిక్కెట్టుకలక్టరుగారూ, తమ దగ్గి రనా, కాని తెలియనితనం, అయినా తాము కటాక్షించాలి' అంటూవుంటే, పక్కనే కూర్చున్న శెట్టి 'ఏదో పొరబాటు వొచ్చివుంటాది బాబూ, అతికార్లు తమలాంటి వోళ్ళు ..' అనేప్పటికి, టికెట్ కలెక్టర్ ధుమధుమ లాడుతూ, 'ఎబ్బే మీకు తెలియ దండీ, వీళ్ళు బలే రోగ్స్. ఇప్పుడు కక్కించుతాను చూడండి, ఎక్కడికి వెళ్తాడు. ఏవరిచేతిలో పెట్టా ననుకుంటున్నాడో, నోరు మెదపకుండా కూర్చుంటే ఏమవుతుం దనుకుంటున్నావో ఆల్‌రైట్ చూస్తాడు తమాషా ప్రోసెక్యూట్ చేయించి వేస్తాను' అని ఆతనివేపు తిరిగి, 'ఏయ్ ఇక్కడనే కూర్చో, ఖబడ్దార్, పైస్టేషన్లో నీ సంగతి కనుక్కుంటాను' అంటూ అతని టికెట్ జేబీలో పెట్టుకుని బండి ఆగ గానే దిగిపోతున్నాడు. ఇంతవరకూ అర్థంకానిచూపులు అటూ ఇటూ చూస్తూవున్న అతనుకూడా చట్‌మని లేచి బండి దిగిపోయాడు

అది చూసి శాస్త్రులుగారు 'బలే ఘటికుడులావున్నాడు ఎంత ధీమాగా మాట్లాడకుండా కూర్చున్నాడు' అన్నారు శెట్టి 'ఆ దొంగయెదవలండి, యీళ్ళు దోపిడీలుకూడా చేస్తారు ' అనేప్పటికి, అవతలి బల్లమీదను కూర్చున్న వొకాయన బండికప్పుకేసి చూపిస్తూ అందుకనే 'దొంగ లున్నారు జాగ్రత్త, అని కంపెనీవాళ్ళు రాశారు, అన్నాడు ఆ చివరను కూర్చున్న ముసలాయన వొకరు 'ఇంతకూ ఎవరిసామానులూ ఏమీ పోలేదుగదా?' అనే అనడంతోనే ఎవరిసామానులు వాళ్ళు

తనిఖీ ఆమర్దాతో పడిపోయారు శెట్టి కంగారుగా పక్కకు చూసుకుని 'నాపెళ్ళాం ఏదీ?' అని బిగ్గరగా అరిచేటప్పటికి, నలుగురూ నవ్వు ఆపుకోలేకపోయారు ఒక కొంటె విద్యార్థి 'దొంగ ఎత్తుకుపోలేదుగదా? అంటూవుండగానే ఆవిడ కంపార్ట్ మెంట్ చివరనుంచి తలుపు తీసుకుని రావడంచూసి అందరూ పకపకా నవ్వేశారు, శెట్టి గొంతుకలో అడ్డపడిన వుండ దిగమింగుకుని కేవిటిగాని, మెళ్ళో నగలన్నీ సరిగ్గావున్నాయా? అన్నాడు' మెడ గాభరాగా తడుముకుంటూ 'వుండకేం?' అన్నది. శాస్త్రిగారు, 'ఏమి పిరికితనం శెట్టీ, మెడలో వుండగానే ఇంతమందిలో తీయగలుగుతారా ఎవరైనా, మొత్తంమీద కోమటివనిపించు కున్నావు' అన్నారు ఆత్మాభిమానం కదిలి, శెట్టి శాస్త్రులవారివేపు చూస్తూ 'మాటలకేంలెండి, ఎవళ్ళవొస్తువులు యెవళ్ళు యెతుక్కోడం మానేశారు'' అంటూవుండగానే మళ్ళీ అతను వొగురుస్తూ, తనటికెట్ చేతిలో పట్టుకుని, తలుపు తోసుకుని బండిలో ప్రవేశించాడు ఇంజన్ హఠాత్తుగా ఆగిపోతే బండ్లు ఒకదానికి వొకటి కొట్టుకు న్నట్టు వొకరికి వొకరు తగిలి ఆగిపోయారు

వెంటనే పరుగెత్తుకొని కదులుతూవున్న బండిలోకి టికెట్‌కలెక్టర్ యెక్కి, అతని యెదరకు రాగానే, అతను కన్నులు నిప్పులు కురుస్తూ, పెదవులు అల్లల్లాడి పోతూ, చేతులు పిడికిళ్ళుపట్టి చంపుతానన్నట్టు సౌంజ్ఞలుచేస్తూ 'బే ఎ ఎ ఏ, ఏ ఎ ఎ ఏ అని, తంతాను జాగ్రత్త, ఎవరనుకున్నావో - మీసం మెలివేస్తూ — గొంతుకు నులిపి కిటికీలోనుంచి అవతలికి పారవేస్తాను. నీ వాతఖలాంటివాళ్ళని చూశాను, అని అనేకవిధాల ఈ అభిప్రాయాలన్నీ కళ్ళతోనూ వేళ్ళతోనూ చేతులతోనూ తెలివైన మూగవాడు చెప్పేటట్టు చెయ్యుతూ, శాస్త్రులవారిని చూడమన్నట్టు పది వేళ్ళు చూపించి వేళ్ళమీద రూపాయిలు మోగించే సౌంజ్ఞచేసి, నుదుటిమీద చెమట ఊడ్చినట్టు వేలితో తీసి, నిరసనగా టికెట్‌కలెక్టర్ వైపు చేయి విసిరి పో పోమ్మంటూ, 'ఎవడి సొమ్ము అనుకున్నావ్ పట్టుకుని పారిపోతావ్?' అని చిందులు తొక్కుతూ బె ఏ ఏ అని పెద్ద కేకలువేస్తూ నానా అహంగామీ చేశాడు.

టికెట్‌కలెక్టర్ మొహాన్ని నెత్తురుచుక్క లేదు చిన్నబుచ్చుకున్న మొహంతో

కొయ్యబొమ్మలా నిలబడిపోయాడు నలుగురూ నవ్వుతూ అంటూవున్న మాటలకు వుక్రోషం ఆపుకోలేక మూగఅతన్ని సౌంజ్ఞచేసి, 'సంతకం చేయలేవా?' అని ప్రశ్నించాడు, మూగఅతను లేచి నిలబడి నేను సంతకం చేయగలిగితే నీలాగే మెడపక్కలను అక్షరాలు తగిలించుకుని, వీరిని టికెట్ వారిని టికెట్ అని దభాయిస్తూ ఇల్లా నిర్లక్ష్యంగా సంతకాలు పెడుతూ, ఇల్లా నడిచేవాణ్ణి, అల్లా నడిచేవాణ్ణి, అనే అర్థాలు వొచ్చేటట్టుగా సౌంజ్ఞలుచేస్తూ పక్కవాళ్ళటికెట్లను చిత్తైరలో తట్టి అడిగినట్టు అడిగి, పటపటా సంతకాలుపెట్టినట్టు వేలితో వకవకా గీసి టికెట్‌కలెక్టర్ నడకను హేళనచేస్తూ వంకరనడకలన్నీ నడిచి, అందరూ కడుపులు చెక్కలయ్యేటట్లు నవ్వుకొంపగా నానా అల్లరీ చేశాడు ఆఖరికి టికెట్‌కలెక్టర్‌కూడా నవ్వు ఆపుకోలేక పకపకా నవ్వాడు

మూగఅతను ఇంత అల్లరీ చేసి తనస్థలంలో కూర్చుంటగానే టికెట్‌కలెక్టర్ రైలుతలుపు తీసి దానికి చేరబడి సిగరెట్టు వెలిగించాడు మూగఅతను శాస్త్రులుగారిని ఉద్దేశించి, టికెట్‌కలెక్టర్ని మాపుతూ వేళ్ళుముడిచి చేయి తనముఖం దగ్గర నుంచి అతనివేపు విసిరి, 'ఉత్త దొంగలు, వీళ్ళంతా ఇంతే' అన్నట్టు అన్నాడు అందరూ ఘొల్లుమని నవ్వారు శాస్త్రిగారు సౌంజ్ఞచేసి, 'టికెట్‌కలెక్టర్ అడిగినప్పుడు మూగవాడను అని ఎందుకు నీవు చెప్పలేదు?' అని ప్రశ్నవేశారు, రెండు చెవులలోనూ వేళ్ళుపెట్టుకుని, 'చెవుడు, వినబడదు' అని తెలియజేశాడు. శెట్టి అందుకుని 'యీళ్ళ కింతేలెండి, మాఅయ్యామ్మ అల్లుడికూడా యింతే, మూగుంటే శెవుడుకూడా వుంటాది' అన్నాడు ఇంతలో మూగ అతను టికెట్‌కలెక్టర్ని రమ్మని పిలిచి సిగరెట్ అడిగి తీసికొని, అంటించి, అతని వీపు తట్టి, 'మంచి వాడవేలే పొమ్మన్నట్టు సౌంజ్ఞలు చేశాడు టికెట్‌కలెక్టర్ చిరునవ్వుతో తలుపు దగ్గరికు వెళ్ళి నిలుచున్నాడు.

ఇదిచూసి శెట్టి 'మూగోళ్ళకి మాంచి తెలివితేటలు వుంటాయిసుమా !' అన్నాడు. ఆ మూగఅతను తల వంకించి. నోటిలోనుంచి సిగరెట్ తీసి "తెలివితేటలంటే ఆయనవే తెలివితేటలు", అని విస్పష్టంగా అంటూ టికెట్‌కలెక్టర్ని

వేలితో చూపించేసరికి, రైలంతా నిర్ఘాంతపోయారు టికెట్‌కలెక్టర్ ఆ దెబ్బకు రైలు తలుపునకు అంటుకుపోబట్టి కాని, లేకపోతే తుళ్ళి రైలుకింద పడేవాడే! శాస్త్రులవారు నోరు తెరచి 'ఆ,' అన్నారు. ఇంతలో సిగరెట్ ఇంకొక దమ్ము పీల్చి, 'మనుష్యుల్ని మొహంచూడడంతోనే ఎవరు ఎటువంటివాడో కని పెట్టగలిగిన ఆ టికెట్‌కలెక్టర్ తెలివితేటలముందు, నా తెలివితేటలెంత?' అని అతనుమందహాసం చేశాడు. ఇంతమూగవాడు అంత స్పష్టంగా హఠాత్తుగా మాటలు వొచ్చి మాట్లాడడంవల్ల తమబుఱ్ఱలలో కలిగిన ఉక్కిరిబిక్కిరి కొంచం తట్టుకుని, బండిలోనివారందరూ అన్నివిధాలా 'అరే నిజంగా మూగవాడే అనుకున్నాం, మాంచి తెలివైనవాడే'' అంటూవుంటే, తలకాయలో గిఱ్ఱుమనిపోయిన మెదడు కాస్త సర్దుకుని, టికెట్‌కలెక్టర్ అతని ఎదరకు వొచ్చి నిలిచి 'నేను ఇంతవరకూకూడా నమ్మలేదు. వీళ్ళందరినిబట్టీ ఊరుకుని ఆలోచిస్తున్నాను అంత తొందరగా టోపీలో పడే బాపతుకాదు మనం' అన్నాడు శెట్టి అడ్డువొచ్చి 'అది న్యాయంకాదు. మీరు యెలాగా తెల్లమొహం యేశారు? అబ్బో ఆయనముందు' శాస్త్రులవారు 'మహా ఘటికుడివయ్యా' అః 'అన్నారు టికెట్‌కలెక్టరు బొమముడి చిట్లించి అధికారం గొంతుకు పెట్టి 'తే' ఆటికెట్ ఇట్లా తే! నీసంగతి కనుక్కుంటాను ఏం వేళాకోళం అనుకున్నావేం రైలంటేను? ఖబడ్దార్ చొక్కించింపించుతాను, ఈసారి' అని గర్జించాడు అతడు కిమ్మనకుండా ఆ టికెట్ జేబీలో నుంచితీసి అతని చేతిలో వుంచాడు 'సామర్లకోట రానీ నీసంగతి కనుక్కుంటాను. ఇప్పుడు ఎక్కడికి వెళ్తావ్ ఛడాచోర్' అన్నాడు టికెట్‌కలెక్టర్.

'యేసిన టోపీ యేశావ్, అలాగే వూరుకోక యెందుకు మాట్టాడావయ్యా?' అన్నాడు శెట్టి 'ఎక్కువ గడుసుదనంతో ఎక్కువ తెలివితక్కువకూడా వుంటుం దిలే?' అన్నారు శాస్త్రులవారు. అతను మాత్రం దీర్ఘంగా నిట్టూర్చి, టికెట్‌కలెక్టర్ వైపు చూసి 'మీయిష్టం దాచడం యెందుకని నిజం చెప్పివేశాను' అన్నాడు'. 'ఇది నాటక మనుకున్నావులాగుంది, రానీ సామర్లకోట చెబుతాను' అని తలుపులోనుంచి అతడు తొంగి చూస్తూ వుండగానే రైలు ప్లేట్ఫారం అందుకుంది. 'దిగి ఆ

బుకింగ్ ఆఫీస్ దగ్గరకు రా మాట్లాడవుందా' అని టికెట్ తన జేబీలో పెట్టు కుని దిగిపోయాడు టికెట్ కలెక్టర్

అతనుకూడా టికెట్ కలెక్టర్ వెంటనే దిగుతూ తన పక్కనున్న ఆయనతో 'సరే అలాచెయ్యండి, మిమ్మల్ని ఇంటివద్ద కలుసుకుంటా' నన్నాడు బండిలో వాళ్ళందరూ విభ్రాంతపోయి చూస్తున్నారు, ఏం జరుగుతుందా అని తెలివికక్కు వగా ఒయటపెట్టుకున్నాడు అని అందరూ అంటూవున్నా శాస్త్రులవారు మాత్రం 'ఏవో మరొక మెత్తు వున్నది' అంటున్నారు అతను మాట్లాడివెళ్ళినఆయన పరుపు దింపి టికెట్ గేటు దాటి పక్కనే నిలబడి వున్నాడు అదొంగమూగిని వెంటపెట్టుకుని టికెట్ కలెక్టర్ బుకింగ్ఆఫీసుదగ్గరకు వెళ్ళాడు. ఆతను బయట నిలబడి ఏదో ప్రతి మాలినట్లు ప్రతిమాలుతున్నాడు టికెట్ కలెక్టర్ 'మనదగ్గర జాంతా నై, ఛేక్కోర్ అంటూ టికెట్ల ఆఫీసులోనికి వెళ్ళాడు ఒక తృటి అటూ ఇటూ చూసి, మనవాడు సరసరా నడిచి టికెట్ గేటు పక్కకు చేరి, గేటు అవతల నిలుచున్న తన స్నేహితుడి దగ్గరనుంచి రహస్యంగా మరొక పచ్చటికెట్ అందు కుని. గేటులోవున్న ఆయనకు చూపించి బయటకు చల్లగా దాటిపోయాడు ఇదంతా ఆశ్చర్యంతో చూస్తూ రయిలులోని వాళ్ళంతా తెల్లబోతున్నారు టికెట్ కలెక్ట ఆఫీసులోనుంచి బైటికి వొచ్చేటప్పటికే సరిగ్గా మూగవాడు జట్కాలో పరుపుపెట్టించి తాను ఎక్కడానికి సిద్ధంగా నిలుచుని, స్టేషన్ వైపు చూస్తున్నాడు శెట్టి 'అరి దీన్ని ... 'అని చిటిక వేశాడు. ఒక క్షణం అటూ ఇటూ కలియజూసి టికెట్ కలెక్టర్ సర్రుమని గేట్ దగ్గరకు పరుగెత్తాడు మూగఅతను జట్కాలో ఎక్కి కూర్చుని వెన కటి మూగభాషలో గట్టిగా ' బేఎఎఏమ్ఏఎఏ' అని టికెట్ కలెక్టర్ని పలకరిం రించాడు. టికెట్ కలెక్టర్ 'ఆరే!' అని గేటుఅవతలకు కాలు పెట్టబోయేప్పటికి, అదొంగమూగ గుడ్ నైట్ చేస్తూ 'బేఏఏ, 'అంటూనే ఎందుకులే అక్కడనేవుండు పాపం. అన్నట్టు అంటున్నాడు. జట్కా రయింహిమన్నది. పైగా జట్కా కదిలి పోయే లోపుగా కుడిచేతివేళ్ళు ముద్దుపెట్టుకుని ఆముద్దు టికెట్ కలెక్టరుకు విసిరాడు.

రైలు బండిలో ఉన్నవారంతా గొళ్ళుమని నవ్వేటప్పటికి టికెట్ కలెక్టర్

మొహం కందగడ్డలాగయింది. చేయి దాటిపోయిన జట్కాని అతను యింకా అట్లా చూస్తున్నాడు, ముఖానికి తన్నిన రక్తం ఇంకా దిగవుండా ఇంతలో రైలు కూడా కదిలింది. శెట్టి తమాషా గొంతుకుతో 'అయ్యా తిక్కట్టుకలెక్టరుగారూ దైనేయండి ఈ బండికూడా జారిపోతాది' అని కేక వేయకపోతే నెత్తిమీద పెద్దదెబ్బ తగిలి నప్పుడు కలిగే చైతన్యశూన్యతవంటి ఆ స్థితిలోనుంచి టికెట్ కలెక్టరుకు రైలుస్మృతి అంతలో కలిగేది కాదు.

